శ్రీ విజయభట్ ప్రొడక్షన్సు

# గుణవంతుడు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకుడు — నిర్మాతలు

ఆదుర్తి సుబ్బారావు - యస్.యస్. భట్ - యస్.యస్. మూర్తి



# ఈ మూడు సుగుణాలను ఇవ్వగలిగినది రూబీ డస్ట్ టీ మాత్రమే

**1.** తక్షణమే డికాక్షన్

**2.** నిండైన పరిమళం

**3.** ప్రతి పొట్లానికి ఎక్కువ కప్పుల టీ

చిక్కటి రసము మరియు
పొదుపుతో కూడిన ఒకే
ఒక్క టీ లిప్టన్ రూబీ డస్ట్.
లిప్టన్ రూబీ డస్ట్ — నిండైన
కమ్మదనము, మెండైన
సువాసన కలిసి మెలిసిన టీ.



**లిప్టన్ రూబీ డస్ట్** ప్రతి ఒక్క ప్యాకెట్టుకు అధిక కప్పుల, రుచికరమైన టీని ఇస్తుంది

LRDC 10 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ ["అలౌకిక సుందరి"] బూర్లె నాగేశ్వరరావు రచన. ఈ నెల కథలలో ప్రత్యేకంగా కొట్టవచ్చినట్టు కనబడే అంశం ఏమిటంటే: కళ్ళ చూసినదంతా నిజం అనుకోవటానికి లేదు; చెవుల విన్న దానికి వేరు అర్థం ఉండవచ్చు! "అలౌకిక సుందరి" అద్భుత సౌందర్యవతి, కాని మనిషి కాదు! అలాగే "అపోహ"లో రాజు కళ్ళారా చూసినది అపోహకు కారణం అవుతుంది! "నిధిరహస్యం"లో నిధి లేదు!

---

సంపుటి 57 నవంబర్ '75 సంచిక 5





# మిత్రభేదం

## 29

### ఇనుము తిన్న ఎలుకలు

ఒకానొక దేశంలో నటుకుడు అనే వర్తకుడు ఉండేవాడు. అతను తన సర్వస్వమూ పోగొట్టుకుని, "కష్టార్జితంతో వైభవంగా బతికిన చోట ఎవడు గాని పేదగా జీవించరాదు. డబ్బు మంచి నీరులాగా ఖర్చుపెట్టి సమస్త భోగాలూ అనుభవించిన చోట పేదగా, యాచిస్తూ బతికేవాడు చులకనగా చూడబడతాడు," అనుకుని, ఎక్కడికైనా వెళ్ళి, డబ్బు సంపాదించుకుని రావటానికి నిశ్చయించాడు.

అతని ఇంట పాతకాలపు త్రాసు, పది మణుగుల బరువుగలది ఉన్నది. తన వ్యాపారం ఉచ్చలో ఉన్న కాలంలో పెద్ద పెద్ద సరుకులు తూచటానికి ఆయన దాన్ని వాడాడు. అతను ఆ త్రాసును తన మిత్రుడైన లక్ష్మణశెట్టి అనే వర్తకుడికి దాచమని ఇచ్చి, దేశాంతరాలకు వెళ్ళిపోయాడు.

అతను విదేశాలలో చాలా కాలం ఉండి, ధనం సంపాదించి తిరిగి వచ్చి, తన త్రాసు ఇయ్యమని లక్ష్మణశెట్టిని అడిగాడు.

"అయ్యో, నాటుకా! ఏం చెప్పమన్నావు? నీ త్రాసును ఎలుకలు తినేశాయి," అన్నాడు లక్ష్మణశెట్టి.

ఈ మాట వినగానే నాటుకుడికి మండిపోయింది. కాని అతను తన కోపాన్ని బయట పడనియ్యక, "మిత్రమా, ఎలుకలు తింటే అది నీ తప్పు ఎలా అవుతుంది? నే నిప్పుడు నదిలో స్నానం చెయ్యబోతున్నాను. నా బట్టలూ అవీ పట్టుకు రావటానికి నీ కొడుకు ధనదేవుణ్ణి పంపగలవా?" అని అడిగాడు.

అట్ట చివరి బొమ్మ



అతని మాట తీసేస్తే, తన మీద పూర్వం ఉండిన మిత్రభావం పోతుందనుకుని, లక్ష్మణశెట్టి తన కొడుకుతో, "నాయనా, మామ స్నానానికి నదికి పోతున్నాడు. అతని వెంట వెళ్ళిరా," అన్నాడు.

ధనదేవుడు నాటుకుడి వస్త్రాలు తీసుకుని సంతోషంగా నదికి వెళ్ళాడు. నాటుకుడు స్నానం చేసి, తిరిగి వచ్చేటప్పుడు ఒక కొండగుహలో ధనదేవుణ్ణి ఉంచి, గుహకు బరువైన రాయి అడ్డం పెట్టి, తన మిత్రుడి ఇంటికి వచ్చాడు.

లక్ష్మణశెట్టి తన కొడుకు గురించి అడిగాడు. "అయ్యో, లక్ష్మణా! నీ కొడుకు గట్టుమీద ఉండగా ఒక గద్ద వచ్చి తన్నుకుపోయింది," అన్నాడు నాటుకుడు.

"వచ్చు అబద్ధం! ఎదిగి వచ్చిన కుర్రవాణ్ణి గద్ద తన్నుకుపోవట మేమిటి?" అన్నాడు లక్ష్మణశెట్టి.

"లక్ష్మణా, అదే జరిగింది. దాన్ని గురించి వితర్కించి ఏం లాభం?" అన్నాడు నాటుకుడు.

ఇద్దరూ తీవ్రంగా ఘర్షణపడి, న్యాయస్థానానికి వెళ్ళారు. లక్ష్మణశెట్టి గొంతు చించుకుంటూ, "న్యాయమూర్తులారా, నాకు ఘోరమైన అన్యాయం జరిగింది. ఈ నాటుకుడు నా కొడుకును తీసుకుపోయి ఎక్కడో దాచాడు," అన్నాడు.

"నేను ఏం చేసేది? ఒడ్డున ఉండగా ఆ కుర్రవాణ్ణి గద్ద తన్నుకుపోయింది," అన్నాడు నాటుకుడు.

న్యాయాధికారులు, "నాటుకా, పదిహేనేళ్ళ వాణ్ణి గద్ద ఎలా తన్నుకుపోగలదు?" అన్నారు.

నాటుకుడు చిరునవ్వు నవ్వుతూ, "పదిమణుగుల బరువు గల నా త్రాసును ఎలుకలు తినెయ్యటం సాధ్యంకాగా, పదిహేనేళ్ళ కుర్రవాణ్ణి గద్ద తన్నుకుపోవటం ఎందుకు సాధ్యం కాదు?" అని అడిగాడు.

"ఏమిటి నువ్వు అనేది? వివరంగా చెప్పు," అన్నారు న్యాయాధికారులు.

నాటుకుడు వారికి జరిగినదంతా చెప్పాడు. న్యాయాధికారులు విరగబడి నవ్వి, నాటుకుడికి గ్రామమూ, శెట్టికి కుర్రవాణ్ణీ ఇప్పించారు.

కరటకం దమనకానికి ఈ కథ చెప్పి ఇంకా ఇలా అన్నది:

"పింగళకం సంజీవకం పట్ల చూపిన ఆదరణ చూసి ఓర్వలేక నువ్వు ఇంతపని చేశావు. నీవంటి వాడి వెంట ఉండటం కూడా అపాయకరమే. ముని వద్దా, బోయవాడి వద్దా పెరిగిన పక్షుల కథలో ఎంతైనా సత్యం ఉన్నది."

"ఏమిటా కథ?" అని దమనకం అడిగింది. కరటకం ఇలా చెప్పింది:

పర్వత ప్రాంతంలో ఒక చిలుకకు రెండు పిల్లలుండేవి. ఒక నాడు తల్లి పక్షి మేతకుపోయి ఉండగా ఒక దొంగ పిల్లలను కాజేశాడు. ఒక పిల్ల దారిలో వాడి బుట్ట నుంచి కింద పడిపోయింది. దొంగ రెండో పిల్లను ఇంటికి తీసుకుపోయి పెంచుకుని, మాటలు నేర్పాడు.

దారిలో పడిపోయిన పిల్ల ఒక మునికి దొరికింది. ఆయన దాన్ని తన ఆశ్రమానికి తీసుకుపోయి, పెంచుకుని, మాటలు నేర్పాడు.

ఒక నాడు ఒక రాజు వేటాడుతుండగా ఆయన గుర్రం బెదిరి, దొంగ ఉండే ఇంటి ప్రాంతానికి తెచ్చింది. రాజును చూడగానే, దొంగవాడు పెంచిన చిలుక, "ఎవడో వచ్చాడు! పట్టు! కొట్టు! చంపు!" అని అరిచింది.

రాజు భయపడి తన గుర్రాన్ని దౌడు తీయించి త్వరలోనే ముని ఆశ్రమానికి వచ్చాడు. ముని పెంచిన చిలుక రాజును చూస్తూనే, "రాజా, స్వాగతం! విశ్రమించండి. నీరు తాగి, పళ్ళు ఆరగించండి! అతిథికి నీరు పట్టుకురండి!" అన్నది.

రాజు రెండు చిలుకల లోనూ గల ఈ వ్యత్యాసానికి ఆశ్చర్యపడి, ఆ రెండూ ఒక తల్లి పిల్లలేనని, తేడా పెరిగిన వాతావరణంలో మాత్రమే నని తెలుసుకున్నాడు.





# 17

[పాతాళగృహం లోని ఒక గదిలో వెల్లాదరియుండి వున్న గజపతివాణ్ణి, ఉదయనుడు కలుసుకున్నాడు. చంద్రా నిషధులు, రాక్షసుడికి బందీలుగా వున్నారని, వాడు వాళ్ళను హింసిస్తున్నాడని గజపతివాడు చెప్పాడు. ఉదయనుణ్ణి, అంజనాలూ, భస్మాలనూ తెచ్చి ఇస్తానని మాట యిచ్చిన మీదట రాక్షసుడు నిషధుణ్ణి వదిలిపెట్టాడు. తరవాత—]

ఉదయనుడు ఎక్కడ వున్నదీ తెలుసుకుని, అతణ్ణిగాని లేకపోతే అతడి వద్ద వున్న భస్మాలూ, అంజనాలూగాని తప్పక తెస్తానని నిషధుడు, రాక్షసుడికి వాగ్దానం చేశాడు. కాని, తీరా నిషధుడు బయలుదేరే సమయంలో రాక్షసుడు అతణ్ణి మూగవాణ్ణి చేసి వదిలాడు.

నిషధుడు కొన్నాళ్ళు ప్రయాణించి, చివరకు మాళవదేశం చేరుకున్నాడు. ఉదయనుడికీ, నిషధుడికీ రూపంలో ఏ మాత్రం తేడా లేనందువల్ల, నిషధుణ్ణి—తాము లోగడ ఎరిగిన ఉదయనుడనుకుని, రాజుగారి నౌకర్లు అతణ్ణి, తమ రాజు వద్దకు తీసుకువెళ్ళారు.

రాజు ప్రతాపసింహుడు కూడా ఆ వచ్చినది ఉదయనుడే అనుకున్నాడు. తను అతడి భస్మాలూ, అంజనాలూ కాజేసినందుకుగాను, కసితో తిరిగి వాటిని



తీసుకుపోవాలని వచ్చి వుంటాడనుకుని, భయపడ్డాడు. అయితే, పైకి మాత్రం ఏమీ తొణకకుండా, "ఏమోయ్! నీవు వెళ్ళిన పని కాయా, పండా?" అని ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించాడు.

ఆ దేశానికి తాను యింతవరకూ ఏనాడూ రాకపోయినా, రాజుగారి నౌకర్లూ, రాజూ కూడా తన నెందుకిలా ఆదరిస్తున్నారో నిశీదుడికి బోధపడింది కాదు. పోనీ, "మీరు ఎవరిని చూచి, ఎవరనుకుంటున్నారో?" అని అందా మంటే, తనను రాక్షసుడు మూగవాణ్ణి చేసి పంపాడాయె! నిశీధుడు ఏమి చెయ్యటమా అని ఆలోచించి, చివరకు సంజ్ఞలవల్ల తను మూగవాణ్ణి అంటూ రాజుకు తెలియచెప్పాడు.

రాజుకు చాలా ఆశ్చర్యం వేసింది. "అదేమిటి, ఉదయునా? నీవు క్రిందటి మారు వెళ్ళేటప్పుడు సలక్షణంగా వెళ్ళితివికదా? ఇప్పుడు మూగవాణ్ణయా నంటావేమిటి?" అన్నాడాయన విస్తుపోతూ.

"ఉదయునా!" అని ఎప్పుడైతే రాజు అన్నారో, నిశీదుడికి అంతా అర్థమై పోయింది. వ్రాతపరికరాలు తెప్పించమని సంజ్ఞచేశాడు, నిశీధుడు. అవి రాగానే, తను ఉదయుణ్ణి కానని, ఉదయుడు తన సోదరుడేనని, ఆతడి జాడ తెలియకనే తను యిలా బయలుదేరి వచ్చాననీ—తన సోదరుడు ఎక్కడ వున్నదీ తెలియజేస్తే, సంతోషిస్తానని వ్రాశాడు.

రాజుకు అప్పుడు అంతా అర్థమైంది. తన బండారం ఎక్కడ బయట పడుతుందో అని, భయపడి పోయాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, రాజుకు పచ్చి వెలక్కాయ గొంతుకు పడ్డట్టయింది. "ఎలాగో ఉదయుణ్ణి మోసపుచ్చి భస్మాలూ, అంజనాలూ కాజేసి, వాడి పీడ వదిలించుకున్నానుగదా అని సంతోషిస్తే, మళ్ళీ వీడు తయారయాడే!



ఉదయునంది వివరాలు నాకు తెలిసినట్టు, వీడికి చెబితే ప్రమాదం కోరి తెచ్చు కున్నట్లవుతుంది.'' అనుకున్నాడు రాజు.

ఇప్పుడు రాజుకు మరో దుర్బుద్ధి పుట్టింది. ''ఉదయుడు ఎలాగో యీపాటికి రాక్షసుడి చేతిలో చనిపోయి వుంటాడు. వీడిని కూడా కడతేర్చానంటే, ఇక మిగిలిందల్లా మూడోవాడు. వాడూ ఎప్పుడో నా చేతిలో చిక్కి పోగలడు. అప్పుడు యిక రాకుమార్తెలకు వేరే మార్గం వుండదు.'' అనుకున్నాడు.

రాజు యిలా ఆలోచించి, నిశధుడితో, ''అబ్బాయ్! మీ సోదరుడు యిక్కడికి వచ్చినమాట అయితే నిజమే. కాని, అతడు యిక్కడ ఒక్క పూట మాత్రమే వున్నాడు. ఆ తర్వాత అతని దారిన అతను వెళ్ళిపోయాడు. ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలియదు. అయితే, యీ కష్ట దశలో నేను, నీకు చెయ్యగలిగిన సహాయం అంతా చేస్తాను. ఉదయుడిని వెతకటంలో నీకు సహాయం కావాలంటే, నా సేవకులలో ఒకరిద్దర్ని వెంట పంపు తాను.'' అన్నాడు.

అంతే చాలన్నట్లుగా నిశధుడు తల వంచి, రాజుకు నమస్కరించాడు. ఆ వెంటనే రాజు తన మంత్రిని పిలిచి, రహస్యంగా, '' ఈ కుర్రవాడి వెంట మన భటులనిద్దర్ని పంపించు. ఊరి వెల పలకు చేరుకోగానే, మూడో కంటికి తెలియకుండా చంపివేయమను.'' అని చెప్పాడు.

మంత్రి నిశ్చేష్టుడయాడు. కాని, రాజాజ్ఞ పాటించకపోతే, ముందు తన తల ఎగిరిపోతుంది! చేసేదిలేక రాజాజ్ఞ ప్రకారం యిద్దరు భటులను తోడిచ్చి, నిశధుడిని సాగనంపాడు.

ఇక గడ్డపువాడి వెంట వున్న ఉదయుడు, ఇంక రెండు రోజులలో రాక్షసుడు తిరిగి వస్తాడనగా, ఏమి చేయటమా అన్న దాన్ని గురించి గడ్డపువాడితో సంప్రతించాడు. బాగా ఆలోచించిన మీదట గడ్డపు



వాడు. "ఉదయనా, నన్ను ఎప్పటి లాగా వేలాడదియ్యి. నువ్వు మాత్రం రాక్షసుడు వచ్చేసరికి, గదిలో ఏదో మూల జాగ్రత్తగా నక్కి వుండు. వీలువెంట తరవాత బయటికి పారిపోవచ్చు. ఆ తరువాత తక్కిన కాపలా వాళ్ళతో కలిసి, నువ్వూ కాపలాకుపోయి, నీ సోదరులు ఏమయ్యారో తెలుసుకునేందుకు ప్రయత్నించు. ఇప్పుడు చేయవలసింది యింతకన్న మరేంలేదు." అన్నాడు.

"మరి వాడు యిక్కడికి వచ్చి వస్తాడు. మూడో బాన ఏదని అడుగుతాడేమో నిన్ను. అప్పుడేం చేస్తావు?" అన్నాడు ఉదయనుడు.

"దానికి ఒక ఉపాయం ఉందిలే. మనం పగులచేసిన బాన పెంకులన్నీ, మళ్ళీ తెచ్చి యిక్కడ పోద్దాం." అన్నాడు గడ్డపువాడు.

అదే ప్రకారం యిద్దరూ పెంకులు తెచ్చి పోశారు. రాక్షసుడు యిక రేపు వస్తాడనగా, ఉదయనుడు, గడ్డపువాడిని ఎప్పటిలా వేలాడదీసి, తను గదిలో ఒక మూల నక్కి వున్నాడు.

అనుకున్నట్టే మర్నాడు రాక్షసుడు వచ్చాడు. తలుపు తెరుస్తూనే మూడవ బాన ముక్కలై వుండటం చూసి, "ఇది ఎవరి పనిరా?" అని పెడబొబ్బలు పెట్టుకుంటూ గడ్డపువాడి దగ్గరకు వచ్చాడు.

గడ్డపువాడు ఏమీ తొణకకుండా, "నేనే, బాబయ్యా! వేలాడి వేలాడి విసుగుపుట్టి, కాసేపు ఊగుదామనిపించి, ఊగటం మొదలు పెట్టానండి. నాకు తెలియకుండానే బ్రహ్మాండంగా ఊగానండి. ఆ ఊపులో నేను వెళ్ళి, ఆ బానకు కొట్టుకున్నానండి. అది కాస్తా కిందపడి, యిలా ముక్కలైపోయిందండి. మన్నించాలి," అన్నాడు.

"ఆఘోరించలేకపోయావ్!" అని విసుక్కున్నాడు రాక్షసుడు.

ఈ గొడవ జరుగుతున్నప్పుడే, ఉదయనుడు గదిలోంచి చల్లగా జారుకున్నాడు.



పగటి కాపలా జట్టు వాళ్ళు కొలనుకు బయలుదేరుతుంటే, వాళ్ళతోపాటు తనూ వెళ్ళాడు. ఆ రోజున మాటల సందర్భంలో, అతడు—తనను వెతికి తెచ్చేందుకు నిశీధుణ్ణి, రాక్షసుడు పంపినట్టూ సంధ్య ఒక్కడే కొలనులో వున్నట్టూ తెలుసుకున్నాడు.

ఈ సంగతి తెలిసేసరికి, ఉదయుడు తెల్లబోయాడు. తను ఒక్కడే వుంటే, తన కోసం నిశీధుడు ఎక్కడని వెతగ్గలడు? ఎలాగయినా అతనిని కలుసుకుంటే బాగుండును! కాని అదెలా సాధ్యం? ఉదయుడికి ఏమీ పాలుపోయింది కాదు. ఇందుకు ఏదైనా ఉపాయం చెబితే, గడ్డపువాడే చెప్పాలి అనుకున్నాడు.

అదే ప్రకారం ఆ సాయంత్రం తిరిగి పాతాళగృహం చేరుకోగానే, ఒక్క పరుగున గడ్డపువాడి గది దగ్గిరకు వెళ్ళాడు. కాని, చిత్రమేమిటో, గదితలుపులు బార్లా తెరిచి వున్నై. లోపల గడ్డపువాడు లేడు, రాక్షసుడూ లేడు. దూలానికి కట్టిన తాడు మాత్రం వేళ్ళాడుతున్నది.

ఈ దృశ్యం కంటబడగానే, ఉదయుడు నిలువునా నీరైపోయాడు. "నా ఆశలన్నీ గడ్డపువాడి మీద పెట్టుకుని వస్తే, యిలా అయిందేమిటి? వాడు ఏమైనట్టు? ఇదంతా చూస్తూంటే, రాక్షసుడు గడ్డపువాడి మీద మండిపడి వున్నట్టు తోస్తుంది. వాడు గడ్డపువాడిని హతమార్చ లేదుగదా కొంపదీసి? ఊహూఁ, అలా జరిగి వుండటానికి వీల్లేదు. గడ్డపువాడు ఏదో తంత్రం చేసి, రాక్షసుణ్ణి మాయపుచ్చగలడు. ఇక్కడే మరి ఏ గదిలోనన్నా వాడు బంధించబడి వుండవచ్చు." అనుకుంటూ ఉదయుడు గదులన్నీ గాలించటం మొదలుపెట్టాడు.

అలా వెతుకుతూండగా, ఉదయుడి కాలు నేల మీద ఒక మీట పైన పడింది. అలా పడగానే ఎదురుగా వున్న గోడ రెండుగా విచ్చి దారి ఏర్పడింది. ఉదయుడు ముందుకు ఒక్క అడుగు వేశాడు.



అంతే. రెండవ అడుగు పడనేలేదు. ఎందుచేతనంటే—అతని కెదురుగా ఒక బంగారు ద్వారం కనిపించింది. దానిపై నుంచి భీకరమైన మూడు సర్పాలు బ్రహ్మాండంగా బుసలుకొడుతున్నై. గడ్డపు వాడు ఈ లోపల వున్నాడేమో! కాని, సర్పాలను తప్పించుకు వెళ్ళటం ఎలా? ఉదయనుడు తీవ్రంగా ఆలోచించసాగే సరికి, మెరుపులా ఒక ఉపాయం తట్టింది.

అతడు గడ్డపువాడి గదిలోవున్న బాన నెమ్మదిగా దొర్లించుకు వచ్చాడు. బానలో దూరి మూతవేసుకుని, ఒక్క విసురులో బంగారు ద్వారంలోంచి దూసుకు పోయాడు. మూత తొలగించి తొంగి చూశాడు. మరేం ప్రమాదం లేదని తేలి బైటపడ్డాడు.

ఆ గది చూచేసరికి ఉదయనుడి కళ్ళు మిరుమిట్లు గొలిపినై. గది గోడలూ, నేలా అంతా బంగారుమయమే. క్షణం సేపు విస్తుపోతూ అలాగే గది అంతా పరికిస్తూ వుండిపోయాడు. కాని, అంతలోనే తను వచ్చిన పని గుర్తుకు వచ్చింది. గడ్డపు వాడి కోసం మూల మూలలా వెతక సాగాడు. కనిపించలేదు. కాని, అలా వెతుకుతూండగానే, అక్కడున్న మరో మీట పైన కాలుపడి, ఎదురుగావున్న గోడ ఇదివరకటిలాగానే విచ్చి, దారి యిచ్చింది. క్రిందటి మారు జరిగినట్టుగానే, ఏదో చిత్రం జరుగుతుందనుకుంటూ, ఉదయనుడు అడుగు ముందుకు వేశాడు.

క్రిందటి మారులాగానే, యీసారి కూడా ఒక పెద్ద ద్వారం కనిపించింది. అయితే, యిది వెండిద్వారం. దీనికి ఆరుసర్పాలు వేళ్ళాడుతున్నై. ఒకసారి ఉపాయం కనిపెట్టి వున్నవాడే కనక, ఈ మాటుకూడా బానలో దూరి, ఈ ద్వారం లోంచి కూడా దూసుకుపోయాడు. కాని దురదృష్టవశాత్తూ, యీసారి బాన విసురుగా దొర్లుకుంటూ పోయి, వెండి గది గోడకు కొట్టుకుని ముక్కలు ముక్కలై పోయింది.



ఉదయనుడు బాననుంచి బైటపడ్డాడు. గది గోడలూ, నేలా అంతా వెండి మయం. అయితే, ఆ వింత చూస్తూ, విస్తుపోతూ వుండిపోక ఉదయనుడు ముందుకు పోయే మార్గం ఏమిటా అని వెతికాడు. కాని, యిక్కడ మెట్లు ఏవీ కనిపించ లేదు. అయితే, గది పై కప్పు నుంచి, వెండి గొలుసు ఒకటి వేళ్ళాడుతున్నది. ఒక్క ఎగురు ఎగిరి అది పట్టుకుని లాగాడు. ఎదురుగా వున్న వెండిగోడ, మెల్లిగా పైకి లేచిపోయి దారి ఏర్పడింది. లోపలకు అడుగు పెట్టాడు. ఉదయనుడు. ఈసారి కూడా ఒక పెద్ద ద్వారం కనిపించింది. అయితే, యిది రత్నాలతో పొదగబడిన ద్వారం. దీని పై నుంచి పన్నెండు సర్పాలు వేళ్ళాడుతున్నై.

ఉదయనుడు యింతవరకూ బానలో దూరి ఎలాగో బంగారు ద్వారం, వెండి ద్వారం దాటుకొచ్చాడు. ఆ బాన కాస్తా పగిలిపోయింది. ఏమిటి మార్గం? ఇలాంటివి యింకా ఎన్ని ద్వారాలు దాటాలో, యింకా ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవలసి వుంటుందో, అనుకున్నాడు ఉదయనుడు. తిరిగి పోవాలన్నా, ద్వారాల దగ్గిర వున్న సర్పాలతో ప్రమాదం వున్నది. పోని తెగించి రత్నాల ద్వారం ప్రవేశించేందుకు ప్రయత్నిద్దామా అంటే, ఒకటి కాదు, రెండు కాదు, పన్నెండు సర్పాల నుంచి తప్పించుకోవాలి!

ఉదయనుడు, "ఏమిటా దారి, భగవంతుడా!" అనుకుంటూ, ఆ రత్నాల గదిలోనే కూర్చుని తీవ్రంగా ఆలోచించ సాగాడు. కాని ఎంత ఆలోచించినా, ప్రాణాలకు తెగించి లోపలకు పోవటం తప్ప వేరే మార్గం కనిపించలేదు. అంటే ముందు ద్వారానికి వేలాడుతున్న సర్పాలను సంహరించాలి.

మరు ఆలోచన లేకుండా ఉదయనుడు చప్పున కత్తి దూసి, వేలాడుతున్న ఆ సర్పాల పైన ఒక్కవేటు వేశాడు. ఆ దెబ్బతో ఆరు సర్పాల తలలు తెగి

పడినై. మరోదెబ్బ వేశాడు. ఈసారి ఆయిదింటి తలలు ఎగిరి పోయినై. ఒక్క సర్పం మిగిలింది. దానిని తెగటార్చితే, ఇక లోపలకు ప్రవేశించవచ్చు!

ఉదయనుడు గురి చూసి కత్తి విసిరాడు. కాని సర్పం యీసారి దెబ్బ తప్పించుకొని, ఒక్క విసురులో వచ్చి ఉదయనుడి చేతి మీద కాటువేసింది. అతడి చేతిలోని కత్తి కాస్తా కిందపడింది.

విషం ఎక్కి పోతున్నది ఉదయనుడికి. ముచ్చెమటలు పోసినై. ఆలస్యమైతే ప్రాణానికే మోసం. ఉదయనుడు కత్తి తీసుకుని ఒక్క వేటుతో చెయ్యినరికి వేసుకున్నాడు. మరో దెబ్బతో ఆ సర్పాన్ని కూడా ఖండించివేశాడు. మరుక్షణమే స్పృహతప్పి పడిపోయాడు.

అలా ఎంతసేపు పడివున్నాడో తెలియదు. తిరిగి స్పృహ వచ్చి చూసేసరికి, తెగిన చేతినుండి కారిన రక్తం మడుగు కట్టివుంది. ఇంకా రక్తం కారుతూనే వుంది. ఏమిటి చేయటం. భరించటం తప్ప! బాధపడుతూనే ముందుకు సాగాడు ఉదయనుడు.

కొంత దూరం వెళ్ళేసరికి ఒక పెద్ద గుహ కనిపించింది. అందులో రాక్షసుడు కొలుస్తూవున్న దేవి విగ్రహం కనిపించింది. దేవి మెడలో నూట ఒక్క పుర్రెలు వెళ్లాడుతున్నై. నోటిలో నుంచి భుగ భుగమంటూ అగ్ని జ్వాలలు వస్తూ వున్నై. కళ్ళల్లో నుంచి తీవ్రమైన వెలుగు, వెలుగులోంచి కిరణాలు వస్తున్నై. దేవి చెయ్యి చాచివున్నది. అరచేతిపైన ఒక గద్ద నిలబడివున్నది. ఆ వాతావరణమంతా చాలాభయంకరంగా వున్నది.

అయినా ఉదయనుడు చలించలేదు. ధైర్యం కూడ దీసుకొని, విగ్రహం వైపుకు నడిచాడు. నాలుగడుగులు వేశాడో లేదో, దేవి నోసటి నుండి బ్రహ్మాండమైన పొగ వెలువడి. గుహ అంతా ఒక్క సారిగా కమ్ముకున్నది. ఆ పొగలో ఉదయనుడు ఉక్కిరి బిక్కిరై పోసాగాడు.

—(ముగింపు పై సంచికలో)





# అలౌకిక సుందరి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు చేస్తున్న ఈ పని గురించి నీ హితం కోరినవారు ఏమన్నారో నాకు తెలియదు గాని, హితుల మాట విననివాడు హితులను పోగొట్టుకుంటాడు. అందుకు తార్కాణంగా నీకు ప్రదీప్తుడు అనే రాజకుమారుడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

సువర్ణగిరి యువరాజు ప్రదీప్తుడు. అతను గొప్ప సౌందర్య పిపాసి. కళాభిమాని అయి ఉండేవాడు. అతని వద్ద ప్రమోదుడు అనే ఒక చిత్రకారుడు ఉండేవాడు. ప్రమోదుడు ఆ కాలపు

## బేతాళ కథలు



చిత్రకారుల లాగా కాక, వాస్తవిక దృశ్యాలను మాత్రమే చిత్రించేవాడు. అతని చిత్రాలలో ప్రకృతిలోని జీవకళ ఉట్టిపడేది.

ప్రమోదుడి చిత్రాలంటే ప్రదీపుడికి చాలా అభిమానం. వారిద్దరికీ గాఢమైన మైత్రి కూడా ఉండేది. ఇద్దరూ అన్నదమ్ముల లాగా మసలుకునేవారు.

ఒకసారి ప్రదీపుడు ప్రమోదుణ్ణి, "నువ్వు ఊహా చిత్రాలు ఎందుకు చిత్రించవు?'' అని అడిగాడు.

"కళ్లతో చూడని దాన్ని నేను చిత్రించలేను, అది నాకు సాధ్యం కాదు,'' అన్నాడు ప్రమోదుడు.

ప్రమోదుడు తరచుగా కొండలలోకి వెళ్ళి, అక్కడ తాను చూసిన దృశ్యాలు చిత్రించి తెచ్చి యువరాజుకు చూపుతూ ఉండేవాడు. అలా ప్రమోదుడు ఒకసారి తెచ్చిన చిత్రాన్ని చూసి, "ఇది వాస్తవంగాలేదు. ఇందులో ఏదో భావం ఉన్నది. ఏమిటా భావం?'' అని అడిగాడు ప్రదీపుడు.

ఆ చిత్రంలో ఒక కొండ చరియ నుంచి ఒక చెట్టు కిందికి పెరుగుతున్నది. చెట్టు అలా తలకిందులుగా పెరగటం అసంభవమన్నాడు ప్రదీపుడు. ప్రమోదుడు అతన్ని ఆ ప్రదేశానికి తీసుకుపోయి, తలకిందులుగా ఉన్న చెట్టును చూపాడు. కొన్ని కోతులు ఆ చెట్టు వెంబడి దిగిపోయి, కొండ దిగువన ఉన్న ఏటిలో నీళ్ళు తాగుతున్నాయి. అది నిలువుగా పెరిగిన చెట్టే అయి ఉండవచ్చు! ఏ కారణం చేతనో ఒరిగి, తలకిందులైపోయి కూడా బతికే ఉన్నది.

ప్రమోదుడు వాస్తవ దృశ్యాలను తప్ప చిత్రించడని ప్రదీపుడికి రూఢి అయిపోయింది.

తరవాత కొంత కాలానికి ప్రదీపుడు వివాహం చేసుకోవాలనుకున్నాడు. కన్యాన్వేషణ సులభం కాదు. అందుకని అతను ప్రమోదుడి సహాయం కోరుతూ,

అతన్ని అనేక దేశాలకు వెళ్ళి, ఎక్కడెక్కడి రాజకుమార్తెల చిత్తరువులూ తయారుచేసి తెమ్మనిపంపాడు.

ప్రమోదుడు అనేక దేశాలు తిరిగి, అనేకమంది రాజకుమార్తెల చిత్తరువులు చిత్రించి, సువర్ణగిరికి తిరుగు ప్రయాణం సాగించాడు. ఈ ప్రయాణంలో అతని కొక వింత అనుభవం కలిగింది.

ఒకనాడు అరణ్య మార్గంలోనే చీకటి పడింది. అయినా మంచి వెన్నెలరాత్రి కావటం చేత ప్రమోదుడు ఆగకుండా నడక సాగించాడు. అర్ధరాత్రివేళ అతనికి తాను వెళ్ళే కాలిబాటకు ఒక పక్క నుంచి శ్రావ్యమైన సంగీతం వినిపించింది. దానితోబాటు ఎవరో నృత్యం చేస్తున్నట్టు లయబద్ధంగా మువ్వల ధ్వని కూడా వినిపించింది.

ప్రమోదుడు అమితాశ్చర్యంతో ఆ ధ్వని వినిపించిన దిక్కుగా వెళ్ళి, ఒక అద్భుత దృశ్యం చూశాడు. పండు వెన్నెలలో పూలచెట్ల మధ్య దట్టమైన పూల తివాసీ పైన ఒక అతిలోక సుందరి వయ్యారంగా నాట్యం చేస్తూ, పాడుతున్నది. ప్రమోదుడు దగ్గరగా వెళ్ళి ఆమె నాట్యాన్ని చూసి ఆనందించ సాగాడు.

ఆమె 'చాలాసేపు నృత్యం చేసి, చివరకు అలసిపోయినట్టుగా తూలి, ప్రమోదుడి మీదపడి, మరుక్షణం దూరంగా జరిగి, "క్షమించండి! అలసిపోయి ఒళ్ళు తూలింది." అన్నది.





"దాని కేం గాని. ఇంత సౌందర్యవతివి. నాట్య గానాలలో ప్రవీణురాలివి! ఈ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు?" అని ప్రమోదుడు ఆమెను అడిగాడు.

ఆమె పకపకా నవ్వి, "ఒంటరితనమంటే నాకు భయంలేదు. ఈ అరణ్యం నాకు కొత్తకూడాకాదు. రండి, మా యిల్లు చూపిస్తాను." అంటూ ప్రమోదుణ్ణి ఒక ఇంటికి తీసుకుపోయింది. ఆమెనుగురించి అసలే అనుమానంతో బాధపడుతున్న ప్రమోదుడికి ఆ ఇల్లూ, లోపలి అలంకరణలూ, ఇంటి చుట్టూ ఉన్న ఉద్యానమూ, అందులో ఉన్న వింత చెట్లూ చూసి మరింత అనుమానం కలిగింది. అతనికి సమీపంలోనే నక్కలు కూయటం కూడా వినిపించింది. అతనికి కొద్దిగా భయం కూడా కలిగింది.

ఆమె ఉండే ఇంట మరెవ్వరూ లేరు. ఆమె అతనికి ఒక ఆసనం చూపి, తినటానికి ఏవో పళ్ళు పెట్టింది. తరవాత అతన్ని మరొక గదికి తీసుకుపోయి, అక్కడ సిద్ధంగా ఉన్న పూలపాన్పు మీద పడుకోబెట్టి, విసురుతూ పక్కన కూర్చున్నది. ప్రమోదుడు కళ్ళు మూసుకుని, అలాగే నిద్రపోయాడు.

తిరిగి అతను పక్షుల కలకలానికి మేలుకున్నాడు. అతను కళ్ళు తెరిచి చూసేసరికి ఆ నాట్య సుందరి లేదు, ఆమె ఇల్లూ లేదు. అతను ఒక చెట్టు కింద పడుకుని ఉన్నాడు. ఎక్కడ చూసినా ఎముకలూ, కుండ పెంకులూ కనిపించాయి. అది శ్మశానం లాగున్నది.

ప్రమోదుడికి ఒళ్ళు జలదరించింది. తాను రాత్రి కన్నది కల కాదు. ఆ స్త్రీ ఒక పిశాచం అయి ఉంటుంది. తాను ఆమె జోలికి పోక పోవటం మేలయింది. అయితే ఆమె సౌందర్యాన్ని మరిచి పోవటం అతనికి సాధ్యం కాలేదు. ఆమె రూపు అతని కళ్ళలో మెదులుతూనే ఉన్నది.



ప్రమోదుడు చివరకు నగరం చేరి, తాను చిత్రించి తెచ్చిన రాజకుమార్తెలందరి పటాలూ ప్రదీపుడి ముందు పెట్టాడు. ప్రదీపుడికి వాటిలో ఒకటి కూడా నచ్చలేదు.

"రాజకుమార్తెలలో సౌందర్యం ఇంత కరువవుతుందని నేను ఊహించలేదు. ఇంత కన్న సౌందర్యవతులు ప్రపంచంలో చాలా మంది ఉంటారనుకున్నాను," అన్నాడతను నిరాశతో.

కొన్నాళ్ళు గడిచినాక అతను ప్రమోదుణ్ణి అతని ఇష్టం వచ్చిన సుందరి బొమ్మ ఒకటి చిత్రించి, తనకు ఆనందం కలిగించమని నిర్బంధ పెట్టాడు.

తప్పించుకునే మార్గం లేక, ప్రమోదుడు ఒక స్త్రీ చిత్తరువు ప్రారంభించాడు. అతను ప్రయత్నం చెయ్యకుండానే అతను అరణ్యంలో చూసిన నాట్యసుందరి బొమ్మ తయారయింది. ఆమెను చిత్రించటం తప్ప అతనికి గత్యంతరం లేకపోయింది. ఎందుకంటే, ఆహోరాత్రాలు ఆమె రూపమే అతని మనసులో మెదులుతున్నది.

దాన్ని చూస్తూనే ప్రదీపుడు స్తంభించి పోయాడు. ఆడవాళ్ళలో అంత అందగత్తెలుంటారని అతను ఎన్నడూ ఊహించలేదు. అతను ప్రమోదుడితో, "ఇటువంటి సుందరి లోకంలో ఉండగా నాకు చూపకుండా ఎందుకు దాచావు?" అన్నాడు.

"యువరాజా, ఇది వాస్తవరూపం కాదు." అన్నాడు ప్రమోదుడు.

"అబద్ధం ఆడకు. నువ్వు కళ్ళచూడని దాన్ని చిత్రించలేవని నాకు తెలుసు," అన్నాడు ప్రదీపుడు.

"వాస్తవం కానివి కూడా కళ్ళకు ఒకప్పుడు కనిపిస్తాయి," అన్నాడు ప్రమోదుడు.

"అంటే నువ్వు ఈ స్త్రీని ఎక్కడో చూశావన్నమాట!" అన్నాడు ప్రదీపుడు.

చూసినట్టు ప్రమోదుడు ఒప్పుకున్నాడు.



"నాకు కూడా ఆమెను చూపించు. నేను ఆమెను పెళ్ళాడి తీరాలి." అన్నాడు ప్రదీపుడు.

"యువరాజా, తొందర పడవద్దు. మిత్రుడుగా నీ క్షేమం కోరి చెబుతున్నాను. ఆమెను పెళ్ళాడటం అసంభవం. ఆమె అసలు మనుష్య స్త్రీ కాదు. నేను చూసిన చోట ఆమె కనిపిస్తుందన్న నమ్మకం కూడా నాకు లేదు. తగినకారణం ఉండే నేను నీకు ఆమె సంగతి చెప్పలేదు." అన్నాడు ప్రమోదుడు.

ప్రదీపుడు మొండి పట్టుబట్టి, ఆమె బ్రహ్మరాక్షసి అయినా సరే తాను పెళ్ళాడతాననీ, ఆమె కనిపించిన చోటికి తనను వెంటనే తీసుకుపొమ్మని ప్రమోదుడితో అన్నాడు. ప్రమోదుడు సరేనన్నాడు.

ఇద్దరూ కలిసి గుర్రాలమీద అరణ్యానికి బయలుదేరారు. ఆ రోజు కూడా వెన్నెల కాస్తున్నది. ప్రమోదుడు నాట్యసుందరిని చూసిన చోటుకు చేరి, గుర్రాలు దిగి, అర్ధరాత్రి కోసం ఎదురుచూడసాగారు.

చివరకు వాళ్ళకు సంగీతమూ, మువ్వల చప్పుడూ వినిపించాయి. ఇద్దరూ ఆ సుందరి నాట్యం చేసే దిక్కుగా వెళ్ళి దూరంగా నిలబడి ఆమెనూ, ఆమె నాట్యాన్నీ చూశారు. ప్రదీపుడు మాత్రం మతిపోయిన వాడిలాగా పరిగెత్తి, ఆమెను సమీపించాడు. ఆమె తూలినట్టుగా అతని మీదపడి, దూరంగా జరిగి, క్షమాపణ చెప్పుకున్నది.

ప్రదీపుడు పరవశుడైపోతూ, "సుందరీ, నీ కోసమే వచ్చాను. నిన్ను చూసి ధన్యుణ్ణి అయాను. నిన్ను ప్రేమిస్తున్నాను. పెళ్ళాడతాను." అంటూ ఆమె చేతులు రెండూ పట్టుకున్నాడు.

సుందరి కిలకిలా నవ్వి, "మీ యిష్టం!" అన్నది.

ఆమె అతన్ని తన ఇంటికి ఆహ్వానించింది.

"వద్దు! నీ యింటికన్న గొప్ప భవనాలు నాకు చాలా ఉన్నాయి.

ఎందుకు ఆలస్యం? నా వెంట వచ్చెయ్యి!" అన్నాడు ప్రదీపుడు. ఇద్దరూ చేతులు పట్టుకుని నడుస్తూ ప్రమోదుణ్ణి సమీపించారు.

ప్రమోదుడు అతనితో, "యువరాజా, ఈమె మనిషికాదు, పిశాచి. నీ మంచి కోరి చెబుతున్నాను. ఈమెను నగరానికి తీసుకుపోకు. ఇక్కడే వదిలెయ్యి," అన్నాడు. ప్రదీపుడు వినిపించుకోలేదు.

"అర్థం లేకుండా మాట్లాడకు. నేను ఇంత దూరం వచ్చింది ఈమెను వదిలెయ్యటానికా? ఇంత కాలానికి నాకు భార్య కాదగినది దొరికితే ఆమెను వదిలెయ్యమనటం నీ కుళ్ళు బుద్ధి తప్ప మరేమీకాదు," అన్నాడతను.

"నీ నిర్ణయం మార్చుకోకపోతే నేను నీ వెంటరాను. దాన్ని పెళ్ళాడాలను కుంటే నన్ను వదులుకో," అన్నాడు ప్రమోదుడు.

"లోకమంతా నన్ను వదిలేసినా నేనీ సుందరిని వదలను," అన్నాడు ప్రదీపుడు.

"అయితే, నీ యిష్టం!" అంటూ ప్రమోదుడు తన గుర్రాన్ని ఎక్కి, ఎటో వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళాక ప్రదీపుడు అక్కడే ఆ సుందరితో ఆ రాత్రి గడిపాడు. తెల్లవారేసరికి అతని కౌగిటిలో ఒక అస్థిపంజరం మాత్రమే ఉన్నది. దాన్ని చూసి అతనికి కంపరం పుట్టుకొచ్చింది. అతను



అసహ్యంతో దాన్ని దూరంగా తోసేసి, తన గుర్రాన్ని ఎక్కి, వేగంగా తన నగరం కేసి బయలుదేరాడు. వెనక నుంచి ఎవరో పకపకా నవ్వటం వినిపించింది. కాని అతను వెనక్కు తిరిగి చూడలేదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ప్రమోదుడు యువరాజును ఎందుకు వదిలిపెట్టి వెళ్ళాడు? సుందరి అతనికి భార్య కాబోతున్నదన్న అసూయ చేతనా? లేక యువరాజు తనమాట వినలేదన్న అహంభావం చేతనా? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రమోదుడికి అసూయ ఉన్నదనటానికి ఆధారం లేదు. అసూయ గలవాడైతే ప్రదీప్తుడికి సుందరి కనబడకుండా చెయ్యటం అతని చేతిలోని పనే; మరొక అరణ్యప్రాంతానికి తీసుకుపోయి, అక్కడే తనకు సుందరి కనిపించిందనవచ్చును. యువరాజు తన మాట వినలేదన్నందుకు అతను అలిగి వెళ్ళిపోవటం కూడా కాదు. ఆమె పిశాచి అని అతనికి మొదటి నుంచీ రూఢిగా తెలుసును. కళ్ళకు కనిపించే అవాస్తవాలను కూడా అతను గ్రహించగలవాడు. అలాటి శక్తి యువరాజుకు లేక సుందరిని శంకించలేక పోయాడు. యువరాజు సుందరిని నిజంగా తెచ్చి పెళ్ళాడితే అందుకు తానే బాధ్యుడనవుతానన్న భావం ప్రమోదుడికి కలిగి ఉంటుంది. ఎందుకంటే, తాను సుందరి చిత్రపు రాయకపోయినా, యువరాజుకు సుందరిని చూపకపోయినా యువరాజు సుందరిని పెళ్ళాడగోరటం జరగదు. అందుకే ప్రమోదుడు యువరాజును వదిలి వెళ్ళిపోయాడనటానికి సందేహం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)





# అపోహ

భీమేశ మహారాజుకు ముగ్గురు భార్యలు. మొదటి ఇద్దరూ రెండేళ్ళ వ్యవధిలో పోయారు. ఆయనకు తన మూడో భార్య తారావతి అంటే చాలా ప్రేమ. రాజు వయసు నలభై ఏళ్ళు. తారావతి ఇరవై అయిదేళ్ళది. ఆమె చాలా తెలివిగలదీ, అనేక విద్యలలో ఆరితేరినదీనూ.

రాజుకు వేట అంటే సరదా; ఎప్పుడు వేటకు వెళ్ళినా తారావతిని వెంట తీసుకు పోయేవాడు. ఒకసారి ఆయన వారం రోజులపాటు వేట కార్యక్రమం పెట్టుకుని, తారావతిని ప్రయాణానికి సిద్ధం కమ్మన్నాడు. అంతా సిద్ధమయింది. కాని బయలుదేరే రోజున రాజు ఆమెను తన వెంట తీసుకుపోలేదు సరికదా, ఆమెను తన మందిరం నుంచి బయటకు రాకుండా ఆడ సిపాయీలను ఏర్పాటు చేశాడు.

ఆ క్రితం రాత్రి రాజు తారావతి మందిరానికి రాలేదు. తారావతిని ఏడేళ్ళ క్రితం వివాహమాడినది లగాయతు రాజు ప్రతి రాత్రి తారావతి మందిరంలోనే పడుకునేవాడు. అందుచేత ఆ రాత్రి ఆయన రాకపోవటం ఆమెకు విడ్డూరంగా తోచింది. ఆమె ఆయన కోసం చాలా సేపు ఎదురుచూసి నిద్రపోయింది. తెల్లవారి లేచేసరికి తాను నిర్బంధంలో ఉన్నట్టు తెలుసుకున్నది.

తనను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకునే రాజు తనను నిర్బంధంలో ఉంచటం ఆమెకు అమితమైన ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ ఉత్తరువు కూడా ఆమెకు రాజు స్వయంగా చెప్పలేదు: ఆయన వేటకు బయలుదేరి వెళ్ళేటప్పుడు ఆమెకు వీడ్కోలు కూడా చెప్పలేదు. ఇలా ఎందుకు జరిగిందో తెలుసుకుందా

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



మని ఆమె తనకు కాపలా ఉన్నవాళ్ళను ప్రశ్నించి చూసింది. కాని వాళ్ళు మూగ వాళ్ళలాగా ఏ ప్రశ్నకూ సమాధానం చెప్పలేదు. ఆమె అంతరంగసఖి కుమారి కూడా సమయానికి దగ్గరలేదు; ఆమె క్రిందటి రాత్రే చావు బతుకులలో ఉన్న తన తండ్రిని చూడటానికి రహస్యంగా రాజభవనం నుంచి వెళ్ళిపోయింది. నిస్సహాయస్థితిలో తారావతి ఏడ్చింది.

ఇదివరకు ఆమె కంటతడిపెడితే ఆమె పరిచారికలు గిలగిలలాడి పోయే వారు; ఎన్నో విధాల ఊరడించేవారు. కాని ఇప్పుడామెను ఎందుకు ఏడుస్తున్నా వని అడిగేవారులేరు. ఎంతమార్పు!

ఇలా రెండు రోజులు గడిచాయి. మూడో రోజున తారావతి అంతరంగసఖి కుమారి తిరిగి వచ్చింది. వస్తూనే కుమారి రాణి పరిస్థితి అర్థం చేసుకున్నది. అర్థ రాత్రివేళ కాపలావాళ్ళు నిద్రమత్తులో ఉన్న సమయంలో కుమారి తారావతితో, "ఏం జరిగింది, అమ్మా?" అన్నది.

తారావతి తనకు ఏమీ తెలియదంటూ తన పరిస్థితి కుమారికి చెప్పి, "నీ తండ్రి ఎలా ఉన్నారు?" అని అడిగింది.

"ఆయన పోయారు," అన్నది కుమారి విచారంగా.

"అయ్యో, పాపం! నిన్ను రాజభవనం నుంచి పంపటానికి నేను ఎంత సాహసం చేశాను! ఇంతకూ ఆయనను ప్రాణాలతో చూశావా?" అని తారావతి అడిగింది.

"చూశానమ్మా! ఆయన నా చేతుల్లోనే ప్రాణాలువదిలాడు," అన్నది కుమారి.

"ఇంత కష్టంలోనూ నాకు అది ఒకటే తృప్తి: నువ్వు నీ తండ్రిని ప్రాణాలతో చూశావు!" అన్నది తారావతి.

అనుకున్న దాని కన్న ముందుగానే, నాలుగో రోజున, రాజు వేట నుంచి తిరిగి వచ్చేటప్పుడు తారావతి ఆయనను కిటికీలో నుంచి చూసింది. ఆయన ముఖం విషాదంగా ఉన్నది. అది చూసి ఆమెకు దుఃఖం పొంగిపోయింది.



ఆమె ఒక కాగితం మీద ఇలా రాసి పంపింది: "నన్ను చిత్రవధ చేసినా భరిస్తాను. కాని నేను చేసిన నేరం ఏమిటి?"

వెంటనే రాజు వద్ద నుంచి జవాబు వచ్చింది: "నువు నీతి తప్పిన దానివి. నేను నిన్ను ఎంతగానో ప్రేమించాను. కాని నువు పరపురుషుణ్ణి ప్రేమించావు. నీకు మరణమే దండన."

తారావతి మరొకసారి తన భర్తకు ఇలా రాసింది:

"చచ్చి పోవటానికి నేను సిద్ధమే. కాని చచ్చిపోయే ముందు మీ పాదాలు తాకనియ్యండి. మీరు నన్ను అగ్ని సాక్షిగా వివాహమాడారు. నా చివరి కోరిక మన్నిస్తారనుకుంటాను. ఒక్కసారి నాకు మీ దర్శనం కావాలి."

రాజు తారావతి వద్దకు వచ్చాడు. తారావతి కనుసన్న గ్రహించి కుమారి అవతలికి వెళ్ళిపోయింది.

"నేను నీతి తప్పినట్టు మీకు ఎలా తెలిసింది?" అని తారావతి రాజును అడిగింది.

ఉమేశ మహారాజు రుద్ధ కంఠంతో, "నువు నీతి తప్పిన దానివే. నా కళ్ళను నేను ఎలా నమ్మకుండా ఉండను? ఆ రాత్రి నేను పడుకోవటానికి వస్తూ, తోట వైపు కిటికీ గుండా ఒక దృశ్యం చూసి, నువు నీతి తప్పిన దానివని తెలుసుకున్నాను." అన్నాడు.

తారావతి శాంతంగానూ, గంభీరంగానూ రాజుతో, "కంటికి కనిపించేది ఎల్లప్పుడూ నిజంకాదు. కొద్ది నిమిషాలు వ్యవధి ఇస్తే నేను ఆ మాట రుజువు చేస్తాను." అన్నది.

"రుజువు చెయ్యి." అన్నాడు రాజు.

తారావతి పక్కగదిలోకి వెళ్ళి, చేతిలో ఒక కప్పు, ప్లేటూ పట్టుకుని తిరిగి వచ్చి, "మీ వద్ద నాలుగు బంగారు నాణాలుంటే ఇయ్యండి." అన్నది.

రాజు తన జేబులో నుంచి కొన్ని బంగారు నాణాలు తీసి, నాలుగు ఎంచి,



తారావతికి ఇచ్చారు. తారావతి ఆ నాణాలను ప్లేటులోకి తీసుకుని, ఖాళీ కప్పు రాజుకు చూపి, ఎడమ చేతిలో ఉన్న ప్లేటు నుంచి నాణాలను ఖాళీ కప్పులోకి పోసింది. ఇలా చేసేటప్పుడామె ప్లేటునూ, కప్పునూ రాజు దృష్టికి ఎగువగా పట్టుకున్నది.

"అంతా మీరు కళ్ళారా చూశారు. చూసినదంతా నిజమేనని మీ నమ్మకం. అందులో ఎన్ని నాణాలున్నాయో చెప్ప గలరా?" అన్న దామె రాజుతో.

"నన్ను అడగటం దేనికి? అందులో నేనిచ్చిన నాలుగు నాణాలూ ఉంటాయని నీకు మాత్రం తెలీదా?" అన్నాడు రాజు.

తారావతి ముందుకు వచ్చి కప్పులో ఉన్న నాణాలను ప్లేటులో కుమ్మరించింది. ప్లేటులో ఎనిమిది నాణాలున్నాయి. రాజుకు నోట మాటలేదు.

"చూశారా? కళ్ళు చూసినది ఎల్లప్పుడూ నిజం కాదు. ఇప్పుడు చెప్పండి. మీరు ఏం చూసి నా నీతిని శంకించారు? తోట వైపు కిటికీలో నుంచి మీకు ఏం దృశ్యం కనబడింది?" అన్నది తారావతి.

"నేను చూసినది తప్పే కావచ్చు. కాని నువు పడకగదిలో ఒక కాపలా భటుణ్ణి కౌగలించుకుని, లాలన చేస్తూన్నట్టు నాకు కనిపించింది. మీరిద్దరూ ఎదురెదురుగా నిలబడి ఉన్నారు. ఇది చూడగానే నాకు ఆగ్రహం వచ్చింది. కత్తి మీదికి నా చెయ్యి వెళ్ళింది. నేను ఆ ఆగ్రహాన్ని అతికష్టం మీద నిగ్రహించుకుని, ఇక ఎన్నటికీ నీ ముఖం చూడరాదని నిశ్చయించుకుని, నిన్ను మందిరం దాటి రానియ్యవద్దని, ఉత్తరవు ఇచ్చాను," అన్నాడు రాజు.

తారావతి ఒక వింత నవ్వు నవ్వి, "ఇదా సంగతి? మీరు మీ ఆగ్రహాన్ని అణచుకోవటం మంచిదయింది, లేకపోతే ఒక నిర్దోషిని చంపిన పశ్చాత్తాపం మిమ్మల్ని జీవితాంతం పీడించి ఉండేది.



మీరు మరొక అరగంట తరవాత వచ్చి నట్టయితే అదే కిటికీగుండా మరొక వింత దృశ్యం చూపిస్తాను. నా గదిలో కనిపించే దృశ్యం చూసి వెళ్ళిపోవద్దు, తిన్నగా పడక గదిలోకే వచ్చేసి, పర్యవసానం చూడండి," అన్నది.

"దీని అంతు తెల్సుకోవాలి. అలాగే వస్తాను," అన్నారు రాజు.

"అయితే ఒక్క మనవి. నేను రాజ భవన నియమం ఒకటి ఉల్లంఘించాను. క్షమించాలి," అన్నది తారావతి.

"అది అల్పమైనదేనా?" అని రాజు అడిగాడు.

"అవును. రాజభవన సేవకుల విధులకు సంబంధించినది. గొప్ప నేరం ఏమీకాదు," అన్నది తారావతి.

"అయితే పరవాలేదు. నిన్ను క్షమిస్తాను," అన్నాడు రాజు.

అరగంట దాటాక రాజు తారావతి మందిరానికివస్తూ, తోట వైపు కిటికీ వద్ద ఆగి, రాణి పడక గదిలోకి చూశాడు. ఆయన ముందు చూసి మండిపడిన దృశ్యమే తిరిగి కనిపించింది. తారావతి రాజభవన రక్షక భటుణ్ణి కౌగలించుకుని, లాలిస్తున్నది!

ఇదిచూసి రాజు ఉద్రేకపడిపోయి అతివేగంగా పడక గదిలోకి వచ్చాడు. ఇద్దరు వ్యక్తులూ ఎడమయ్యారు. రక్షక భటుడు పారిపోబోతూండగా రాజు అతన్ని పట్టుకున్నాడు. తారావతి ముందుకు వచ్చి, ఆ భటుడి తలపాగా, పెట్టుడు మీసాలూ, గడ్డమూ లాగేసింది. తారావతి అంతరంగ సఖి అంజన కుమారిని గుర్తించి రాజు నివ్వెరపోయాడు.

"నాకిదంతా అయోమయంగా ఉన్నది. ఇలావచ్చి దగ్గిర కూర్చుని దీనికి అర్థం ఏమిటో చెప్పు, వేధించక!" అన్నాడు రాజు తారావతితో.

తారావతి ఇలా చెప్పింది:

"రాజభవన నియమం ప్రకారం, ఇక్కడ పనిచేసే ఏ దాసీ కూడా రాత్రి

వేళ బయటికి పోరాదు. కుమారి తండ్రి చావుబతుకుల్లో ఉన్నట్టూ, చీకటిపడి వార్త తెలిసింది. ఆయనను కుమారి ప్రాణాలతో చూడాలంటే వెంటనే బయలుదేరాలి. ఆమెను అప్పుడే పంపటానికి నే నొక ఉపాయం ఆలోచించాను. మిగిలిన దాసీలతో, కుమారి రెండు మూడు రోజుల పాటు అత్యవసరమైన పనిమీద నా గది దాటకుండా ఉండిపోతుందని చెప్పాను. రాజభవన రక్షకుల దుస్తులు సంపాదించ మని కుమారికి చెప్పాను. కృత్రిమంగా కుమారికి గడ్డాలూ, మీసాలూ తయారు చేసి అంటించాను. కుమారి రక్షకభటుల దుస్తులు ఎక్కడనుంచో తెచ్చింది. తన తండ్రిని ప్రాణాలతో చూడగలనో, లేనో అని కుమారి ఏడుస్తూంటే, ఆమెను కౌగలించుకుని, ఓదార్చాను."

"ఎంత పొరపాటు పడ్డాను! ఎంత మూర్ఖంలో పడిపోయాను. నన్ను క్షమించు, దేవీ!" అంటూ రాజు తారావతిని కౌగలించుకున్నాడు.

తరవాత రెండు మూడు రోజులకు కుమారి తారావతికి తలదువ్వుతూ, "అమ్మా, ఆ బంగారు నాణాలు రెట్టింపు ఎలా అయాయి?" అని అడిగింది.

"ఇంద్రజాలం వల్ల! ఆ కప్పూ, ప్లేటూ ఇలా తీసుకురా. ప్లేటు అడుగున సబ్బు మరకలు ఇంకా ఉన్నాయి. ప్లేటు దిగువన నాలుగు బంగారు నాణాలు సబ్బుతో అంటించాను. రాజుగారిచ్చిన నాలుగు నాణాలూ ప్లేటు పైన ఉన్నాయి. దిగువన అంటించిన నాణాలు ఎవరికీ కనపడకుండా వేళ్ళు అడ్డం పెట్టాను. పై నాణాలు కప్పులో పోసేటప్పుడు కింది వాటిని కూడా వేళ్లతో కప్పులోకి తోశాను!" అన్నది తారావతి, చేసి చూపిస్తూ.

కుమారి చప్పట్లు చరిచి, "తెలివి కాకేమమ్మా! అద్భుతమైన తెలివి!" అన్నది.

"చూడు, కుమారి! ఇది ఎవరికీ చెప్పకు సుమా! ఒట్టే!" అని తారావతి కుమారి చేత ప్రమాణం చేయించింది.



# 167. పాలస్తీనా లోని ప్రాచీనసమాధి

పాలస్తీనా లోని మెగిడ్డో వద్ద 5,000 ఏళ్ళనాటి, కాంస్యయుగ సమాధి బయటపడింది. అందులో ఎముకల గుట్టలూ, కుండలూ ఉన్నాయి. పరిశోధకులు ఈ ప్రాంతంలోనే సొలోమన అశ్వశాలల అవశేషాలనూ, అతి ప్రాచీనమైన కనాన్ సంస్కృతి అవశేషాలనూ కనుగొన్నారు. పాలస్తీనాకు పూర్వం ఉండిన పేరు కనాన్.





# పైసాతో పెళ్ళి

ఒక ఊళ్ళో ఒక ముసలిది. తల్లి తండ్రులు లేని తన మనవణ్ణి ఎంతో గారాబంగా పెంచింది. వాడి పేరు వెంకటప్ప. వాడు ఏమంత తెలివితేటలు గలవాడు కాదు.

కొంత కాలానికి వెంకటప్పకు పెళ్ళి ఈడు వచ్చింది. వాడితోపాటు గాలికి తిరిగిన కుర్రవాళ్ళందరికీ పెళ్ళిళ్ళు అయిపోయాయి. అందుచేత వెంకటప్ప తనకు కూడా పెళ్ళి చెయ్యమని ముసలిదాని దగ్గిర పోరుపెట్టసాగాడు.

''పైసాకు ఠికానా లేదు. నీ కెవరిస్తారు పిల్లను ?'' అన్నది ముసలిది.

''పైసా తెస్తే నా పెళ్ళి చేస్తావా ?'' అని వెంకటప్ప అడిగాడు.

ముసలిది ఏం చెప్పాలో తెలీక, ''నీ చేత్తో పైసా సంపాదించరా, అప్పటి సంగతి ఆలోచిద్దాం.'' అన్నది.

సాయంకాలానికి వాడు ఎక్కడినుంచో ఒక పైసా తీసుకువచ్చి, ''ఇదుగో పైసా! రేపు సాయంకాలానికల్లా నాకు పెళ్ళి చెయ్యకపోయావో నేను ఏ నూతిలోనో గోతిలోనో పడిచస్తాను.'' అన్నాడు.

ముసలిదానికి ఏమీ పాలుపోలేదు. వాడిది అంత మట్టిబుర్ర అయినందుకు ఆమె చింతించింది. ఆమె గడ్డితో ఒక మనిషిబొమ్మ తయారుచేసి, దానికి చీర కట్టి, గుడిసె మూల చీకటిలో దాన్ని కూర్చోబెట్టింది. సాయంకాలం వెంకటప్ప ఇంటికి వస్తూనే, ''పిల్లను చూశావా ?'' అని ముసలిదాన్ని అడిగాడు.

ముసలిది మూలనున్న గడ్డిబొమ్మను చూపుతూ, ''ఇదుగో పిల్ల! ఈ పసుపు తాడు తీసుకుని దాని మెడలో కట్టు!'' అంటూ వాడికి ఒక పసుపుతాడు అందించింది.

గవ్వల నిర్మలాదేవి

వాడు తన స్నేహితుల పెళ్ళిళ్ళు చూసి ఉన్నాడు. తన పెళ్ళి ఇంత హీనంగా జరుగుతున్నందుకు వాడు మండిపడి. "ఇంత నాసిరకం పెళ్ళి నేను చేసుకోను. పురోహితుడూ లేక. మేళ తాళాలూ లేక, అదేం పెళ్ళి ?" అన్నాడు.



"నేనేం చెయ్యను ? నువ్వు తెచ్చిన పైసా ఆ పిల్ల ఓలికే సరిపోయింది. నీకు కావలిసిన హంగులన్నీ ఏర్పాటు చెయ్యటానికి నా దగ్గిర డబ్బు లేదు. నాయినా. ఇష్టముంటే పెళ్ళి చేసుకో ; లేదంటే ఆ పిల్లను వాళ్ళ ఇంటికి పంపేస్తాను." అన్నది ముసలిది.

పెళ్ళి అయింటే చాలుననుకుని వెంకటప్ప చీకట్లో మూలనున్న గడ్డిబొమ్మ మెడలో మూడు ముళ్ళూ వేశాడు. ఈలోపల ముసలిది బయటికి జారుకున్నది.

వెంకటప్ప తన పెళ్ళాంతో మాట్లాడాలనుకుని. "నీ పేరేమిటి ?" అంటూ పలకరించాడు. జవాబు రాలేదు. సిగ్గు పడుతున్నదనుకుని వాడు రెండు మూడు సార్లు పలకరించాడు. అప్పటికీ జవాబు రాకపోయేసరికి మూలనున్న కర్ర తీసుకుని. "మొగుడంటే లక్ష్యం లేదా ? చావు!", అంటూ గడ్డిబొమ్మను ఒక్కటి పెట్టి, గబగబా బయటికి వెళ్ళిపోయాడు.

చాటు నుంచి ఇదంతా గమనిస్తున్న ముసలిది లోపలికివచ్చి. ఆ గడ్డిబొమ్మను తీసుకుని దూరంగా వెళ్ళి. తగలబెట్టేసింది.

ఆ రాత్రంతా ఎటో తిరిగి వెంకటప్ప పొద్దున ఇంటికి తిరిగివచ్చి. ఇల్లు నాలుగు మూలలా వెతికి, "నా పెళ్ళాం ఏదీ ?" అని ముసలిదాన్ని అడిగాడు.

"ఇంకెక్కడి పెళ్ళాం? రాత్రి నువ్వు కొట్టావని అలిగి. పుట్టింటికి వెళ్ళిపోయింది." అన్నది ముసలిది.

వెంకటప్ప పశ్చాత్తాపపడుతూ. "సరే. వాళ్ళ ఇల్లు ఎక్కడో చెప్పు. తీసుకువస్తా." అన్నాడు.

ముసలిది తికమకపడింది. ఏదో ఒకటి చెప్పకపోతే వాడు వదిలిపెట్టడు. అందుకని ఆమె, "పక్క ఊరికి పో. అక్కడ ఏ ఇంటి కప్పు నేస్తూంటే అదే దాని పుట్టిల్లు." అన్నది.

వెంకటప్ప వెంటనే పొరుగూరు బయలుదేరి వెళ్ళాడు. రెండు మూడు వీధులు తిరిగిన మీదట వాడికి ఒక ఇంటి కప్పు ఇద్దరు మనుషులు నేస్తూండటం కనబడింది. అదే తన పెళ్ళాం పుట్టిల్లని, వాడు గబగబా ఆ ఇంట్లోకి జొరబడ్డాడు. కప్పు నేస్తున్నవాళ్ళు వెంకటప్పను, "ఎవరికోసం వచ్చావు?" అని అడిగారు.

"మర్యాదగా నా పెళ్ళాన్ని నా వెంట తక్షణం పంపండి!" అని వెంకటప్ప వాళ్ళను దబాయించాడు.

ఈ మాట వినగానే ఆ ఇద్దరి మనుషుల ముఖాలూ వికసించాయి.

సంగతి ఏమంటే, వాళ్ళిద్దరూ అన్నదమ్ములు; వారికి ఒక చెల్లెలు ఉన్నది. ఆమెకు పసితనంలో పెళ్ళి చేయాలని చూశారు. కాని, ముహూర్తసమయానికి పెళ్ళికొడుకు దేశాలు పట్టిపోయాడు. తిరిగి అతడి జాడలేదు. అందరూ ఆ పిల్లకు మళ్ళీ పెళ్ళి చెయ్యమంటున్నా, ఆమె మొగుడు ఎప్పటికైనా తిరిగి వస్తాడన్న ఆశతో ఆమెను ఇంట్లో పెట్టుకున్నారు వాళ్ళు. తమ చెల్లెలి మొగుడి పోలికలు ఏ మాత్రమూ గుర్తు లేక పోవటం చేత, వాళ్ళు వెంకటప్పను చూసి తమ బావమరిదే అనుకున్నారు.

వాళ్ళు వెంకటప్పను ఆదరంతో లోపలికి ఆహ్వానించి, చక్కగా స్నానం చేయించి, పట్టుబట్టలు కట్టబెట్టి, విందు వంటలతో భోజనం పెట్టి, సారెతో సహా తమ చెల్లెల్ని బండిలో ఎక్కించి, వెంకటప్ప వెంట కాపరానికి పంపారు.

తన మనవడు చక్కని చుక్కను వెంట బెట్టుకు రావటం చూసి ముసలిది, వాడి బుర్రలోపల మట్టిపెట్టిన దేవుడే వాడి నుదుట మంచి గీతగీశాడు కాబోలు అనుకున్నది.





# సుకన్య

సింహపురం యువరాజు పుష్పసింహుడు తన తెల్లగుర్రాన్ని ఎక్కి, కొంత పరివారాన్ని వెంట బెట్టుకుని అరణ్యంలో వేటాడ పోయాడు. వేట బాగా సాగింది. మధ్యలో యువరాజు ఒక లేడిని తరుముతూ చాలా దూరం వెళ్ళాడు. వెళ్ళి, వెళ్ళి, లేడి ఒక ఇంట ప్రవేశించింది. పుష్పసింహుడు కూడా ఆ ఇంట ప్రవేశించాడు.

అది ఒక సంపన్నుడి భవనం. ఆ లేడి ఆ సంపన్నుడి పెంపుడు లేడి. పుష్పసింహుడు తాను సింహపురం యువరాజునని, లేడిని తరుముతూ వచ్చాననీ సంపన్నుడికి తెలిపాడు. తన లేడి ప్రాణాలతో తిరిగి వచ్చినందుకు సంపన్నుడు సంతోషించి, యువరాజును ఆ రాత్రి తన అతిథిగా ఉండమని కోరాడు.

ఆ రాత్రి భోజనాల సమయంలో సంపన్నుడు యువరాజుతో, తన కుమార్తె అయిన సుకన్యను పెళ్లాడమని అన్నాడు. ఆయన తన కుమార్తెను పిలిపించి యువరాజుకు చూపాడు. సుకన్య అందాలరాశి.

యువరాజు ఆమెను, "ప్రమాదం వస్తే నీ మానాన్ని నువ్వు రక్షించుకోగలవా?" అని అడిగాడు.

"రక్షించుకోగలను," అన్నదామె.

పుష్పసింహుడు తృప్తిపడి ఆమెను పెళ్ళాడటానికి ఒప్పుకున్నాడు.

సంపన్నుడు వెంటనే వారిద్దరికీ వివాహం జరిపించాడు. నూతన దంపతులు కొద్ది రోజులు సుఖంగా గడిపిన మీదట, యువరాజు గుర్రం మీద సింహపురానికి బయలుదేరారు.

సూర్యాస్తమయ సమయానికి భార్యాభర్తలిద్దరూ ఒక భవంతి వద్దకు

వి. కేశవరావు



వెళ్ళారు. సుకన్యను బయటనే ఉండమని, యువరాజు తమ ఇద్దరికీ ఆహారం తేవటానికి లోపలికి వెళ్ళాడు.

ఆ సమయంలో, ఇంటి యజమాని భార్య అయిన పద్మావతి, మేడమీది నుంచి చూస్తున్నది. యువరాజు లోపలికి వెళ్ళగానే, ఆమె ఒంటరిగా ఉన్న సుకన్య వద్దకు మనిషిని పంపి, "మీ భర్తగారు ఆకస్మికంగా మూర్ఛపోయారు; మీరు వెంటనే రండి," అని చెప్పించింది.

సుకన్య ఆదుర్దాపడి, మోసం శంకించకుండా లోపలికి వచ్చింది. ఆమె లోపలికి రాగానే పద్మావతి ఆమెను ఒక గదిలో బంధించింది.

పద్మావతి దుర్మార్గురాలు. ఆమెకు సాముద్రికం బాగా తెలుసును. ఆమె సుకన్యను చూస్తూనే ఆమెకు మహారాణి లక్షణాలు ఉన్నట్టు తెలుసుకుని, ఆమెను తన కోడలుగా చేసుకుంటే తన కొడుకు మహారాజు అవుతాడని ఆశపడింది.

యువరాజు పుష్పసింహుడు ఆహారంతో సహా బయటికి వచ్చి చూసేసరికి బయట సుకన్య లేదు. ఆమెను అతను పేరు పెట్టి చాలా సార్లు పిలిచి చూశాడు. ఆమె జాడ చెబుతారేమోనని చాలా మందిని అడిగిచూశాడు. కాని ప్రయోజనం లేక పోయింది. అతను మతిచెడి, సుకన్య పేరే ఉచ్చరిస్తూ, దారితెన్నూ తెలియకుండా తిరగనారంభించాడు.

మర్నాడు పద్మావతి తన కొడుకును పెళ్ళాడమని సుకన్యను అడిగింది. తనకు అదివరకే పెళ్ళి అయిందని సుకన్య జవాబు చెప్పింది. తన కొడుకును పెళ్లాడటానికి ఒప్పుకున్న దాకా సుకన్యకు నిర్బంధం తప్పదని పద్మావతి బెదిరించింది. సుకన్య తెలివిగలది. అందుచేత ఆమె ఆ దుర్మార్గురాలిని మోసగించటానికి ఒక మార్గం ఆలోచించింది. పద్మావతితో ఆమె, "సరే మీ అబ్బాయిని అలాగే పెళ్ళాడతాను. కాని నాకు ఒక వారం రోజులవ్రతం ఉన్నది. అది కాగానే

మీ అబ్బాయిని పెళ్ళాడతాను,'' అన్నది. పద్మావతి అందుకు సమ్మతించింది.

సుకన్య పూనినవ్రతం ఏమిటంటే, వరసగా ఏడు రోజులపాటు ఇంటికి వచ్చిన వారందరికీ తానే స్వయంగా ఆహారం ఇయ్యటం. తన భర్త ఆ ప్రాంతాలే ఉంటాడనీ, ఈ ఏడు రోజుల లోపల రాకపోడనీ ఆమె అనుకున్నది. తనను తీసుకుపొమ్మని భర్తకు ఒక ఉత్తరంరాసి, అతను వస్తే ఇయ్యటానికి దగ్గిర ఉంచుకున్నది.



కాని ఆరు రోజులపాటు పుష్పసింహుడు రానేలేదు. సుకన్య చాలా ఆందోళన పడింది. ఆ యింటి నుంచి బయటపడే మార్గం చూపమని దేవుణ్ణి ప్రార్థించింది. అయితే వ్రతం ఆఖరు రోజున పుష్పసింహుడు వచ్చాడు. అతన్ని చూడగానే సుకన్యకు ప్రాణం లేచి వచ్చింది. కాని, మతిచెడిన పుష్పసింహుడు తన భార్యను గుర్తించలేదు. ఆమె అతనికి ఆహారంతో బాటు తన ఉత్తరం కూడా అందించింది.

పుష్పసింహుడు ఆమె పెట్టిన ఆహారం తిని, ఉత్తరం చదవకుండానే తలవాకిలి దగ్గిర జారవిడిచి వెళ్ళిపోయాడు.

ఒక దుర్మార్గుడు ఆ ఉత్తరాన్ని తీసి చదువుకున్నాడు. అందులో సుకన్య, ''ఈ ఇంటికి అర్ధరాత్రివేళ రండి. నేను వాకిట వేచిఉంటాను. నేను ఇక్కడి నుంచి తప్పించుకోవాలి,'' అని రాసింది.

ఆ దుర్మార్గుడు ఈ అవకాశాన్ని ఉపయోగించుకోదలచి, ఒక వృద్ధుడి వేషం వేసుకుని, అర్ధరాత్రివేళ ఇంటి ముందుకు వచ్చాడు. తన భర్తకోసం ఎదురుచూస్తున్న సుకన్యతో వాడు, ''అమ్మా, నీ ఉత్తరం చూశాను. అది ఇక్కడే పడిఉన్నది. నిన్ను రక్షించటానికి నీ భర్తరాడు. నువు నన్నుగురించి భయపడనవసరంలేదు. నేను నిన్ను రక్షించి, మా కుటీరానికి తీసుకుపోతాను. అక్కడ నేనూ, నా ముసలి భార్యా ఉంటున్నాం.'' అన్నాడు.

తాను మరొక ఉచ్చులో తగులుకో వచ్చునని సుకన్యకు తోచింది. అయితే ఆమె ముందు ఈ ఉచ్చు నుంచి బయట పడటం అవసరం. అందుచేత ఆమె ఆ దుర్మార్గుడితో, ''పోదాం పద!'' అన్నది.

ఇద్దరూ చివరకు ఒక అరణ్యం చేరుకున్నారు. అక్కడ ఆ దుర్మార్గుడు సుకన్యను బలాత్కరించ బోయాడు. సుకన్య, ఆత్మరక్షణ కోసం తన బొడ్డులో దాచి ఉంచిన కత్తితో వాణ్ణి పొడిచింది. వాడు బాధతో మూలుగుతూ పడిపోయాడు. ఆమె అరణ్యంలోకి పారిపోయింది.

రాత్రి అయింది. అరణ్యం సింహ గర్జనలతోనూ, ఏనుగుల ఘీంకారాల తోనూ మార్మోగుతున్నది. సుకన్య భయపడి, ఒక పెద్ద చెట్టు ఎక్కి, దాని కొమ్మ మీద కూర్చున్నది.

తెల్లవారగానే సుకన్య చెట్టుదిగి, తన తండ్రి ఇంటికి బయలుదేరింది. మూడు రోజులు ప్రయాణం చేసి ఆమె తన పుట్టిల్లు చేరుకున్నది. ఆమె చెప్పిన విషాదగాథ విని ఆమె తండ్రి మనుషులను పంపి, తన అల్లుడి కోసం అన్ని దిక్కులా వెతికించాడు.

చివరకు పుష్పసింహుడు దొరికాడు. అతన్ని సుకన్య వద్దకు చేర్చారు. సుకన్య ఉపచారాల ఫలితంగా అతని మతి చాంచల్యం పోయి, మామూలు మనిషి అయాడు. కొద్ది రోజుల అనంతరం సుకన్యా పుష్పసింహులు బయలుదేరి పుష్పసింహుడి నగరానికి వచ్చారు.

పుష్పసింహుడి తండ్రి తన కుమారుడు వేటకు వెళ్ళిననాడే పోయి ఉంటాడని నిరాశ చేసుకున్నాడు. అలాటప్పుడు అతను ఒక భార్యను వెంట బెట్టుకుని మరీ వచ్చేసరికి ఆయన ఆనందం ఇంతా అంతా కాదు. పుష్పసింహుడు జరిగిన సంగతులన్నీ తండ్రికి చెప్పి, సుకన్యను చూస్తూ, ''ప్రమాదం వస్తే తన మానాన్ని రక్షించుకోగలను అన్న సుకన్య ఆ మాట రుజువు చేసింది.'' అన్నాడు.





# నిధి రహస్యం

ఒక ఊళ్ళో బంగారయ్యా, సింగారయ్యా అనే ఇద్దరు వర్తకులు ఉండేవాళ్ళు. ఇద్దరి దుకాణాలూ ఎదురెదురుగా ఉండేవి. ఒకరిని మించి మరొకరు ధనవంతులు కావాలని ఇద్దరికీ ఎంతో ఆశగా ఉండేది.

ఒకనాడు ఉదయం బంగారయ్య దుకాణం తెరిచి కూర్చుని ఉండగా, ఒక బైరాగి, ఏకతార మీటుతూ ఇలా పాడుతూ దుకాణం ముందు నుంచి వెళ్ళాడు:

"ఊరి వెలపల, గోరీ లోపల
ఉన్నది నిధి :
యత్నించిన వాడికే
దక్కుతుంది అది."

ఈ పాట వినగానే బంగారయ్యకు పదేళ్ళనాటి మాట ఒకటి గుర్తుకు వచ్చింది. పదేళ్ళ క్రితం ఆ ఊళ్ళో సుల్తానుల వంశస్థుడు పీరుసాయిబు అనే వాడు ఉండేవాడు. వాడు ఎక్కడి నుంచి వచ్చాడో ఎవరికీ తెలీదు. వాడి చంకన నగిషీలు చెక్కిన చెక్కపెట్టె ఉండేది. అందులో వాడి పూర్వీకుల నిధి ఉందని ఎవరో అనటం బంగారయ్య విని ఉన్నాడు. వాడు చచ్చాక, ఎవరో దయగలవాళ్ళు వాడికి గోరీ కట్టించి, వాడి పెట్టెను వాడితోనే సమాధి చేశారు.

ఇప్పుడు బైరాగి పాట వినగానే బంగారయ్యకు ఆ సంగతి జ్ఞాపకం వచ్చింది. అతను లేచి వెళ్ళి, "అయితే, స్వామీ! ప్రయత్నం చేస్తే నిధి తప్పకుండా దొరుకుతుందంటారా?" అని బైరాగిని అడిగాడు.

బైరాగి అతని కేసి ఆశ్చర్యంగా చూసి, "తప్పకుండా దొరుకుతుంది, నాయనా! ప్రయత్నించి చూడు," అని వెళ్ళిపోయాడు.

పిలేపల్లి జయరాంరెడ్డి

బంగారయ్య సింగారయ్య కేసి చూశాడు. సింగారయ్య ఏమీ విన్నట్టు లేదు. తన వ్యాపారం గొడవలో ఉన్నాడు. బంగారయ్య తృప్తిపడి, ఇంటికి వెళ్ళి, భార్యకు సంగతి అంతా చెప్పాడు.

"ఇంకేం? పదిమంది ఎగబడతారేమో. ఈ రాత్రికే శ్మశానానికి వెళ్ళి, నిధి తవ్వుకు రండి." అన్నది బంగారయ్య భార్య.

అయితే బంగారయ్యకు వల్లకాడన్నా, భూతప్రేతాలన్నా చచ్చే భయం. అందుచేత అతను తన సేవకుణ్ణి పిలిచి, వాణ్ణి తోడు రమ్మన్నాడు. రాము పొద్దుపోగానే వస్తానని వాడు మాట ఇచ్చాడు.

అర్ధరాత్రి అయినా సేవకుడు రాలేదు. బంగారయ్య వాణ్ణి తిట్టుకుని, పలుగూ, పారా చేత పుచ్చుకుని, తను ఒక్కడే శ్మశానానికి వెళ్ళాడు. దడదడలాడుతున్న గుండెతో అతను పీరుసాయిబు గోరీ కేసి వెళ్ళబోతూ చప్పున ఆగాడు. సింగారయ్య గోరీ పడగొట్టి, నేల తవ్వుతూ అతనికి కనిపించాడు. బంగారయ్య ఒక చెట్టు చాటున దాక్కున్నాడు.

సింగారయ్య నాలుగడుగుల లోతు తవ్వగానే అతనికి అస్థిపంజరమూ, నగిషీలు చెక్కిన కొయ్యపెట్టె కనిపించాయి. కొయ్యపెట్టె తెరిచిచూస్తే అందులో ఒక గుడ్డలమూట ఉన్నది. అందులో మూడు ముళ్ళువేసి ఉన్నాయి.

సింగారయ్య మొదటి ముడి విప్పే సరికల్లా, "ఒరే, సింగారయ్యా! నా గోరీ



పగలగొట్టి. నిధి పట్టుకుపోతావురా! నీ పాపం పండిందిలే!'' అన్న మాటలు వినిపించాయి.

సమాధుల మధ్య నుంచి అంత ఎత్తున ఒక ముసుగు ఆకారం పైకి లేచింది.

సింగారయ్య వణికిపోతూ, ''మహా ప్రభో, ఎరక్క ఇటు వచ్చాను. ఈ సారికి నన్ను వదిలెయ్యండి!'' అని చేతిలోని మూట అక్కడే పడేసి, వెనక్కు తిరిగి చూడకుండా పారిపోయాడు.

బంగారయ్యకు కూడా ఇదంతా చూసి దడగానే ఉన్నది. అతను కూడా దయ్యం కంట పడకుండా పారిపోవాలనుకుంటూ ఉండగా, ఆ దయ్యం ముసుగు తీసేసి, తాను నిలబడి ఉండిన సమాధి మీది నుంచి కిందికి దూకి, సింగారయ్య జారవిడిచిన మూట తీసుకున్నది.

ఇంతకూ వాడు బంగారయ్య సేవకుడే! వాడు మూట రెండో ముడి విప్పి, మూడో ముడి విప్పబోతూ ఉండగా వాడి చేతి మీద రెండు రక్తపుబొట్లు పడ్డాయి. వాడు తల ఎత్తిచూస్తే పైనున్న చెట్టు ఆకుల మధ్య నుంచి రెండు గుండ్రని కళ్ళు మెరుస్తూ కనిపించాయి. వాడు, ''అమ్మో, దయ్యం!'' అంటూ మూట జారవిడిచి, అక్కడి నుంచి పారిపోయాడు.

బంగారయ్యకు వాడి భయం అర్థం కాలేదు. అతను ముందుకువచ్చి చెట్టులోకి చూస్తే, దేన్నో తింటున్న గుడ్లగూబ ఆకారం అస్పష్టంగా కనబడింది.



"ఈ మాత్రానికే భయపడ్తాడు! పిరికి వెధవ!" అనుకుని బంగారయ్య, మూట ఎత్తి, మూతి ముడి విప్పాడు. అందులో పాతగుడ్డలు తప్ప ఏమీలేవు. పీరుసాయిబు తన పెళ్లాం మీద ప్రేమతో, బతికినన్నాళ్ళూ ఆమె బట్టలను తన దగ్గిరే పెట్టుకున్నాడు.

తన కృషి వ్యర్థమైనందుకు బంగారయ్య నిరాశ చెందుతూండగా, ఒక గబ్బిలం అతని తలను దాదాపు రాసుకుంటూ ఎగిరిపోయింది. అదే క్షణంలో దగ్గిరలో ఏదో మంట కనిపించింది, గజ్జల శబ్దం వినిపించింది. "బాబోయ్, కొరివి దయ్యం!" అంటూ పరిగెత్తబోయిన బంగారయ్యను ఎవరో బట్ట పట్టుకుని వెనక్కు గుంజినట్టయింది. అతను భయంతో విరుచుకు పడిపోయాడు.

జరిగినదేమంటే, మొదట బంగారయ్య సేవకుడు పెట్టిన కేక విని కాటి కాపరి దివిటీ పుచ్చుకుని అటుగా వచ్చాడు. వాడి మొలకు ఎప్పుడూ మువ్వలుంటాయి. వాడికి ఇంకో అరుపు కూడా వినిపించింది. వాడు పరిగెత్తుకుంటూ వచ్చి, స్పృహ లేకుండా పడి ఉన్న బంగారయ్యను చూసి, ఊళ్లోకి పరిగెత్తిపోయి కబురు అందించాడు.

తిరిగి బంగారయ్య మామూలు మనిషి కావటానికి నెలరోజులు పట్టింది.

ఒకనాడు అతను దుకాణంలో కూర్చుని ఉండగా, ఆ బైరాగే అదే పాట పాడుతూ అటుగా వచ్చాడు. బంగారయ్య బైరాగిని పిలిచి, "నీ బొంద! గోరి లేదు, నిధి లేదు! అంతా అబద్ధం!" అన్నాడు.

బైరాగి ఆశ్చర్యంగా చూసి, "నాయనా, ఏది అబద్ధం? కోరికలతో కూడిన ఈ శరీరానికి వెలపల, మనస్సుకు లోపల ఆత్మ అనే నిధి ఉన్నది. ప్రయత్నించిన వారికి ఆత్మదర్శనం లభిస్తుంది. తెలిసిందా?" అని పాడుకుంటూ వెళ్ళిపోయాడు.

బంగారయ్య నోరు తెరిచి చూస్తూ ఉండిపోయాడు.





# చేసిన మేలు

ఒక ఊళ్ళో గణపతి అనేవాడు ఉండేవాడు. వాడు పట్టి సోమరి, పై పెచ్చు తిండిపోతూనూ. వాడు తరచుగా, పక్క ఊరిలో ఉన్న తన చెల్లెలి ఇంటికి వెళ్ళి, దమ్మిడీ పని చెయ్యకుండా, వారాలూ, నెలలూ తిష్ఠ వేసేవాడు.

చెల్లెలు పార్వతికి అతని ప్రవర్తన చాలా అవమానకరంగా తోచసాగింది. గట్టిగా కోప్పడకుండా, పోట్లాడకుండా అతన్ని ఎలా వదిలించుకోవాలా అని ఆమె ఆలోచిస్తూ ఉండేది.

ఒక నాడు పార్వతి భర్త జగదీశుడు పొద్దునే లేస్తూనే, "ఏమే, ఇవాళ కోడి కూరా, గారెలూ తినాలని బుద్ధి పుట్టింది. నువు తగిన ఏర్పాట్లు చూడు. నేను కత్తికి పదును పెట్టి, కోడిని కోస్తాను," అంటూ, చూరులో నుంచి కత్తి తీసుకుని పెరట్లోకి వెళ్ళాడు.

పార్వతి మినపపప్పు నానబోసి, కత్తిపీట తీసుకుని ఉల్లిపాయలు తరగటం ప్రారంభించింది.

ఉల్లిపాయల ఘాటుకు ఆమె కళ్ళవెంట నీరు కారుతున్నది. ఆ సమయంలో గణపతి ఊడిపడ్డాడు. వాడి మట్టి బుర్రకు, తన చెల్లెలి కన్నీళ్ళకు కారణం ఎంత ఆలోచించినా అర్థం కాక, "ఏమైందమ్మా? ఎందుకు అలా ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

పార్వతికి వెంటనే ఒక ఆలోచన వచ్చింది.

"ఏం చెప్పను, అన్నయ్యా? నువ్వు సోమరి పోతువై, మాటి మాటికి వచ్చి, మా ఇంటి మీదపడి, మా ఇల్లు గుల్ల చేస్తున్నావని మీ బావకు నీ మీద చాలా కోపం వచ్చింది. నిన్ను చూసి, నరికి పారేస్తానని, చూరులో నుంచి కత్తి తీసి,

పీటప జగదీశ్వరి

పదును పెట్టటానికి దొడ్లోకి వెళ్ళాడు. ఈ గండం నుంచి నిన్ను ఎలా రక్షించాలో నాకు తెలియటం లేదు." అన్న దామె ఏడుస్తూ.

గణపతి బెంబేలుపడి, దొడ్లోకి తొంగి చూశాడు. అక్కడ కత్తికి పదును పెడుతున్న జగదీశుడు కనిపించే సరికి హడలి పోయాడు.

కత్తికి పదును పెట్టటం ముగించి లేచిన జగదీశుడు, గణపతిని చూసి, "సమయానికి వచ్చావు, రా, రా!" అన్నాడు.

గణపతి ప్రాణాలు పైనే పోయాయి. వాడు వెంటనే ఇంటి బయటికి పరిగెత్తాడు. అలా పారిపోయే బావమరిదిని చూసి ఆశ్చర్యపడి, జగదీశుడు తన భార్యను, "ఎన్నడూ లేదు. మీ అన్న వస్తూనే అలా పారిపోయాడేమిటి?" అని అడిగాడు.

"ఆఁ, ఏముంది? ఇహనుంచీ కట్టెలు కొట్టుకుని బుద్ధిగా బతుకుతాడుట. నిన్ను అడిగి కత్తి ఇప్పించమన్నాడు. 'నువు అడవికి పోయి కట్టెలు కొట్టేది నిజమే! నిన్ను నమ్మి మీ బావ నీకు కత్తి ఇచ్చేది నిజమే! చాల్లే ఊరుకో!' అన్నాను. కోపం వచ్చి, 'ఇక నేను మీ ఇంటికి రాను,' అని వెళ్ళి పోతున్నాడు." అన్నది పార్వతి.

జగదీశుడు చిరాకుగా, "పుట్టక పుట్టక వాడికి మంచి బుద్ధి పుట్టితే, కత్తి ఇచ్చెయ్యక, వాణ్ణి కోప్పడ్డావా?" అంటూ గణపతి వెంట పడ్డాడు. అల్లంత దూరాన పరిగెత్తుతున్న గణపతిని, "ఆగు! ఆగు!....ఇదిగో కత్తి!" అని జగదీశుడు హెచ్చరించాడు.

ఆ కేకలు విని గణపతి మరింతగా భయపడిపోయి, వేగంగా పరిగెత్తి, క్షణంలో పొలిమేర దాటాడు.

"వాడి కర్మ!" అంటూ జగదీశుడు ఇంటికి తిరిగి వచ్చాడు. పార్వతి అనుకున్నట్టే జరిగింది. "అంతా ఉల్లి చేసిన మేలు," అనుకున్నది ఆమె.





# నమ్మినబంట్లు

శేషపతి అనే ఆయన పనిమీద అడవి అవతల ఉన్న ఒక గ్రామానికి వెళ్ళాడు. అతనికి అడవిదారి తెలియదు. కాని ఆ గ్రామానికి చెందిన ఒక మనిషి శేషపతిని వెంట తీసుకు వెళ్ళి, అక్కడే దిగవిడి పోయాడు. అందుచేత, వెళ్ళిన పని పూర్తికాగానే శేషపతి ఒంటరిగా తన స్వగ్రామానికి బయలుదేరవలసి వచ్చింది. ఆయన అడవిలో దారి తప్పి, అదృష్టవశాన, చీకటిపడే వేళకు ఏదో ఒక గ్రామం చేరాడు.

ఆ ఊరు కొండ కింద ఉన్న ఒక చిన్న గ్రామం. ఊరి మొదట్లోనే ఒక పెద్ద పాతకాలపు భవనం ఉన్నది. సింహద్వారపు తలుపులకు నగిషీలున్నాయి. శేషపతి తలుపు మీద బాదగానే, లోపలి నుంచి ఒక వృద్ధుడు వచ్చి తలుపు తీశాడు.

"మా ఊరు పోతూ దారి తప్పాను. ఈ రాత్రికి మీ ఇంట ఆశ్రయం ఇయ్యగలరా?" అని ఆ వృద్ధుణ్ణి శేషపతి అడిగాడు.

వృద్ధుడు శేషపతిని పరిశీలనగా చూసి, "నువ్వు సాంబశివుడి కొడుకువు కాదూ? మీది ఫలానా ఊరు కాదూ?" అని అడిగాడు.

శేషపతి నిర్ఘాంతపోయి, "అవును. మా విషయాలు మీకు ఎలా తెలుసు?" అని వృద్ధుణ్ణి అడిగాడు.

"నేనూ, మీ నాయనా బాల్యమిత్రులం. పెళ్ళికాగానే నేను ఈ ఊరు ఇల్లరికం వచ్చేశాను. అప్పట్లో సాంబశివుడు అచ్చగా నీలాగే ఉండేవాడు. నిన్ను చూస్తూంటే అతన్ని చూస్తూన్నట్టే ఉన్నది. రేపు పండగ! సరదాగా గడిపి మరీ వెళుదువుగాని!" అంటూ వృద్ధుడు

ఎం. కామేశ్వరరావు



శేషపతిని ఆదరంతో లోపలికి తీసుకుపోయి, తన భార్యకూ, పిల్లలకూ, పరిచయం చేశాడు.

తరవాత శేషపతి స్నానం చేసి, భోజనం చేసి, ప్రయాణపు బడలికవల్ల నిద్ర ముంచుకు వస్తూంటే, తన కోసం వృద్ధుడు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గదిలో, పెద్ద పట్టెమంచం మీద పడుకుని, వెంటనే నిద్రపోయాడు.

ఒక రాత్రివేళ ఏదో అలికిడి అయి శేషపతికి మెలకువ వచ్చింది. ఇంటినిండా మనుషులు మసులుతున్నట్టు తోచింది. పిండివంటల వాసన వస్తున్నది. శేషపతి ఆశ్చర్యపోతూ, తన గదిలో నుంచి ఇవతలికి వచ్చారు. మరొక గదిలో వృద్ధుడూ, ఆయన భార్యా, పిల్లలూ గాఢ నిద్రలో ఉన్నారు. మిగిలిన ఇల్లంతా హడావుడిగా ఉన్నది. ఇంటినిండా జనం! కొందరు బూజు దులుపుతున్నారు. కొందరు ఊడుస్తున్నారు. కొందరు ఇల్లు కడుగుతూ పోతున్నారు. కొందరు ఎక్కడి నుంచో ఖరీదైన వస్తువులు తెచ్చి దించుతున్నారు: నలుగురు ఆడవాళ్ళు వంట గదిలో చేరి, పిండివంటలు వండుతున్నారు.

శేషపతి వాళ్ళ మధ్యకు వచ్చినా, ఎవరూ ఆయనను గమనించలేదు.

"మీరంతా ఎవరు? ఈ ఏర్పాట్లన్నీ ఏమిటి?" అని ఆయన అడిగితే ఒక్కరూ సమాధానం చెప్పలేదు, కనీసం వినిపించుకోనైనా లేదు: తమ మానాన తాము పనులు చేసుకుంటూ పోయారు.

వాళ్ళను అడిగి లాభం లేదనుకుని, శేషపతి వృద్ధుణ్ణి లేపి, "ఇంటినిండా జనం! అంతా తలో పనీ చేస్తున్నారు. విస్తారంగా ఉన్నది. ఇంత సందడిగా ఉంటే మీరంతా పట్టించుకోరేం?" అని అడిగాడు.

"నువ్వు లేచావన్నమాట! పొద్దెక్కాగాని లేవవనుకుని నీకు ముందుగా చెప్పలేదు; పూర్వం ఈ భవంతి ఒక జమీందారు

గారిది. ఆయన నమ్మిన బంట్లూ ఈ మనుషులు. జమీందారుగారూ పోయారు, వాళ్లూ పోయారు. అయినా వాళ్ళకు ఈ ఇంటితో అనుబంధం పోలేదు. ఏ పండగా, పబ్బమూ వచ్చినా, వాళ్ళు వచ్చి ఇంటి పనులన్నీచేసి, ఇంటికి పూర్వపు శోభ తెచ్చి వెళ్ళిపోతారు. మొదట్లో మేం దడుచుకున్నాం, కాని ఇప్పుడు అలవాటై పోయింది. మనం పట్టించుకోకపోతే వాళ్ళు తమ పనులు ముగించి, తమ దారిన తాము పోతారు" అన్నాడు వృద్ధుడు.

"బాబోయ్, వాళ్ళంతా దయ్యాలన్న మాట!" అని శేషపతి నిలువెల్లా వణికి పోతూ అరిచాడు.

"భయపడవలసినపని లేదు. అవి మేలుచేసే దయ్యాలు. అవగింజంత కీడు కూడా చెయ్యవు. నువ్వు వెళ్లి పడుకో," అన్నాడు వృద్ధుడు.

శేషపతి తన గదికి వచ్చేశాడు, కాని తిరిగి నిద్రపోలేక పోయాడు. ఆయనకు వృద్ధుడి కుటుంబాన్ని గురించి అసూయ కలిగింది. కాని ఖర్చు లేకుండా వాళ్ళకు ఈ దయ్యాలు అన్ని సమకూర్చి పోతున్నాయి. ఎంత అదృష్టం! ఇవి మేలు చేసే దయ్యాలే అయితే వాటిచేత తాను ఎందుకు మేలు పొందగూడదూ?

ఈ ఆలోచన రాగానే శేషపతి ఇవతలికి వచ్చాడు. మిగిలిన పనులన్నీ అయి పోయినట్టున్నాయి. అవి దయ్యాలు



ముగ్గులు పెడుతున్నాయి. మగ దయ్యాలు తోరణాలు కట్టుతున్నాయి.

శేషపతి దయ్యాలతో, "మీకు మతి లేదు. జమీందారుగారు పోయి చాలా కాలమయింది. మీరు ఇంకా గబ్బిలాల లాగా ఈ ఇంటినే పట్టుకు వేళ్ళాడటా లెందుకు? మా ఇంటికి రండి. నాకు మేలు చెయ్యండి. ఇక్కడ మిమ్మల్ని పలకరించే దిక్కు కూడా లేదు." అన్నాడు.

దయ్యాలు వినిపించుకోక, తమ పని తాము చేసుకుపోతున్నాయి. ఆ మాటలే చెప్పి, చెప్పి శేషపతికి ప్రాణం విసిగి పోయి, కోపం వచ్చింది. అవి కీడు చేయవన్న ధైర్యంతో అతను ఒక దయ్యం వీపుమీద గట్టిగా చరిచి, "నువ్వయినా జవాబు చెప్పవేం, ముసలి ముండా కొడకా!" అన్నాడు.

దయ్యాలన్నీ పనులు మానేసి శేషపతి మీదికి వచ్చి, అతణ్ణి ఎత్తి, బలంగా వీధిలోకి విసిరి వేశాయి. శేషపతికి నడుము విరిగినంతపని అయింది. ప్రాణం దిమ్మరపోయింది.

అతను మూలుగుతూ, మూలుగుతూ లేచి నిలబడేసరికి తూర్పు తెల్లవారుతున్నది. దయ్యాల జాడలేదు. అతను పెట్టిన కేకలకు ఇంటిల్లిపాతీ లేచివచ్చి, "ఏమయింది?" అని ఆశ్చర్యంగా అడిగారు.

శేషపతి వృద్ధుడితో, "మహ బాగా చెప్పావయ్యా—కీడు చెయ్యవని! నన్ను వీధిలోకి గిరవాటువేసి గొప్పమేలు చేశాయి!" అన్నాడు.

ఇంకా ఏదో జరిగి ఉంటుందని గ్రహించి వృద్ధుడు, "నేను అబద్ధం చెప్పలేదు. నిన్ను వీధిలోకి గిరవాటు వెయ్యటం మాకు మేలుచెయ్యటమేనని ఆ దయ్యాలు అనుకున్నాయి కాబోలు!" అన్నాడు.

శేషపతి సిగ్గుపడిపోయి, ఆ రోజు పండగ అయినా నిలవక, తన ఊరికి బయలుదేరి పోయాడు.





# వీర హనుమాన్

హనుమంతుడు, సీతతో యిలా అన్నాడు: "సీతాదేవి, నేను రాముడి దూతగా నీ వద్దకు వచ్చాను. రాముడు క్షేమంగా ఉన్నాడు: లక్ష్మణుడు నీకు నమస్కరించినట్టు చెప్పమన్నాడు."

రామ లక్ష్మణుల మాట వినగానే సీతకు ఒళ్ళు పొంగి పోయింది. కాని హనుమంతుడు మెల్లిగా తనను సమీపిస్తూండటం చూసి ఆమె, రావణుడే ఈ కోతి రూపంలో వచ్చాడని భయపడి, తాను పట్టుకుని నిలబడి ఉన్న చెట్టు కొమ్మను వదిలిపెట్టి నేల మీద కూలబడింది.

తనను సీత సంశయించి భయపడుతున్నదని గ్రహించి, హనుమంతుడు ఆమెకు నమస్కరించాడు. కాని సీత అతని కేసి చూడక, నిట్టూర్పులు విడుస్తూ, "నువ్వు రావణుడివే అయితే, ఇలా మాయకోతి రూపంలో వచ్చి నన్ను దుఃఖ పెట్టటం మంచిది కాదు. జనస్థానంలో కూడా ఇలాగే సన్యాసి రూపంలో వచ్చావు. అలా కాక నువ్వు రాముడి దూతవే అయితే రాముడి గుణ గణాలు చెప్పు." అన్నది.

రావణుడే మాయరూపంలో వచ్చాడన్న అనుమానంతోబాటు, తాను కలగంటున్నట్టూ, తనకు మతి చలించినట్టూ కూడా అనుమానాలు కలిగి, సీత మనసు చాలా క్షోభపొందింది.

అది గ్రహించి హనుమంతుడు రాముడి ముద్రికను సీతకు ఇచ్చి, రాముడి గుణ

14. అశోకవన విధ్వంసం



గణాలు పొగడుతూ మాట్లాడి, తాను లంకకు ఎలా వచ్చినదీ తెలిపి, సీత మనసుకు ఊరట కలిగించాడు. అతను ఆమె కోరికపై రామలక్ష్మణుల ఆనవాళ్లు వివరంగా చెప్పాడు. తరవాత అతను, రాముడికీ, సుగ్రీవుడికీ మైత్రి కుదిరిన దగ్గిర నుంచీ నడిచిన కథ అంతా చెప్పి, తాను సీతకోసం లంక అంతా గాలించటం గురించి కూడా చెప్పాడు. అంతా విని సీత ఆనంద బాష్పాలు రాల్చింది. ఆమెకు యిప్పుడు హనుమంతుడి పైన విశ్వాసం కుదిరింది.

అంతా చెప్పి హనుమంతుడు సీతతో, "నే నిప్పుడిక ఏం చెయ్యాలి? నీ కేం తోస్తున్నది? నేను రాముడి వద్దకు త్వరగా తిరిగి వెళ్ళాలి. ఆయన నా కోసం ఎదురు చూస్తూంటాడు," అన్నాడు.

సీత హనుమంతుడితో, "సముద్రాన్ని దాటి, రాక్షసులను తప్పించుకుంటూ లంకలో తిరుగుతున్న నీ ప్రజ్ఞ చాలా గొప్పది. నాకు రావణుడు పెట్టిన ఏడాది గడువు తీరే లోపుగా రాముణ్ణి రమ్మని చెప్పు. రావణుడి తమ్ముడు విభీషణుడు నన్ను రాముడికి ఇచ్చెయ్యమని సలహా ఇచ్చినా రావణుడు వినలేదు. విభీషణుడి కూతురు నల అనేది, తన తల్లి పంపగా నా దగ్గిరకు వచ్చి, నాకీ సంగతి చెప్పింది." అన్నది.

హనుమంతుడు ఆమెతో, "నేను వెళ్ళి నీ మాట చెప్పగానే రాముడు వానరులనూ, భల్లూకాలనూ వెంట బెట్టుకుని ఇక్కడికి వచ్చేస్తాడు. అలా కాకపోతే, నా వీపుమీద ఎక్కావంటే, సముద్రాన్ని దాటి, నిన్ను రాముడి వద్దకు తీసుకుపోగలను. నాకు సాధ్యం కాదని భయపడ వద్దు. కావాలంటే నేను రావణుడితో సహా ఈ లంకనే తీసుకుపోగలను. అలా చేస్తే అతి శీఘ్రంగా నీకు రాముడు కనిపిస్తాడు," అన్నాడు.

"ఇంత చిన్న శరీరంతో నన్ను అమిత మైన దూరం తీసుకు పోదామనుకుం



టున్నావే, హనుమంతుడా!" అందుకే నువ్వు కోతివైనావు," అన్నది సీత.

సీతకు తన శక్తి సామర్థ్యాలు తెలియక ఇలా అన్నదని హనుమంతుడు గ్రహించి తన అసలు రూపం ఆమెకు చూపించాలనుకున్నాడు. అతను కొంచెం దూరం వెళ్లి, తన దేహాన్ని పెంచనారంభించాడు. పర్వతం లాటి అతని ఆకారమూ, ఎర్రని ముఖమూ, కోరలూ, గోళ్ళూ చూసి సీత, "ఇతను నిశ్చయంగా లంకానగరాన్ని పెల్లగించుకు పోగలడు, సందేహంలేదు," అనుకున్నది.

"సీతాదేవీ, అనుమానాలు మాను. ఆలస్యం చెయ్యకు. రామ లక్ష్మణుల దుఃఖం పోగొట్టు," అన్నాడు హనుమంతుడు.

"హనుమంతుడా, నీ శక్తి సామర్థ్యాలు నాకు బాగా తెలుసు. నన్ను నువ్వు తీసుకుపోతే ఏ రాక్షసులూ నిన్ను అడ్డలేరు. అయితే రాముడి పని పాడు కారాదు. నేను నీ వెంట రావటం పొరపాటు అవుతుంది. నువ్వు వాయువేగంతో పొయ్యేటప్పుడు నేను భయపడి, సముద్రం చూసి, కళ్ళు తిరిగి, అందులో పడిపోగలను. నువ్వు ఎంత మహా వీరుడివైనా నన్ను రక్షించే బాధ్యత నీ పైన ఉండటం చేత అపాయానికి గురి అవుతావు. నీ వెంట రాక్షసులు పడి నీతో యుద్ధం ఆరంభిస్తే నేను పడిపోయి, రాక్షసులకు చిక్కవచ్చు. ఇప్పటిదాకా పడిన నీ శ్రమ అంతా వ్యర్థమవుతుంది. అంతకన్న, నువ్వు వెళ్లి రాముడితో నా సంగతి చెప్పి, అతన్ని పిలుచుకు రావటం అన్నివిధాలా మేలు. అది అలా ఉంచి, నేను పరపురుషుణ్ణి తాకను. రావణుడు నన్ను బలాత్కారంగా తెచ్చినప్పుడు నేను నిస్సహాయురాలినై ఉంది. ఏమీ చేయలేకపోయాను," అని సీత హనుమంతుడితో అన్నది.

ఆమె చెప్పిన మాటలు యుక్తంగానే ఉన్నాయని హనుమంతుడు ఒప్పుకున్నాడు. అతను సీతను ఏదన్నా గుర్తుగా



అయ్యామని, దానిని రాముడికి చూపుతానని అన్నాడు.

దానికి సీత ఇలా అన్నది:

"నేనొక సంఘటన చెబుతాను. దానిని రాముడికి చెప్పు. నేనూ, రాముడూ గంగా తీరాన, చిత్రకూట పర్వతానికి ఈశాన్య దిక్కున ఒక ఆశ్రమంలో ఉండగా ఒక నాడు రాముడు నా తొడమీద తల పెట్టుకుని నిద్ర పోతున్నాడు. అప్పుడొక కాకి వచ్చి నా రొమ్ములో పొడిచి గాయం చేసింది. నా రక్తంతో రాముడు కూడా తడిశాడు. నేను లేపేసరికి, రాముడు నా రక్తం చూసి మండిపడి, ఒక దర్భ తీసి, బ్రహ్మాస్త్రం మంత్రించి కాకి మీద ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రం కాకిని తరుముతూ పోయి, సమస్త లోకాలూ తిప్పింది. ఇంద్రుడి కొడుకైన ఆ కాకి ఎక్కడా రక్షణ దొరకక, తిరిగి వచ్చి రాముడి కాళ్ళపైన పడింది. బ్రహ్మాస్త్రాన్ని వ్యర్థం చెయ్యటానికి లేదు. అందుచేత కాకి తన కుడికన్ను ఆ అస్త్రానికి బలిచేసి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది. అలాటి శక్తిగల రాముడు శత్రువులను నాశనం చేసి నా కష్టాలు ఎందుకు తీర్చడు? నేనేం పాపం చేశాను?"

"అమ్మా, రాముడు పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు. నేను ఎంతో ప్రయాసపడి వచ్చి నిన్ను చూశాను. ఇప్పుడు నువు ఆనందించాలి గాని, దుఃఖించరాదు. రాముడు త్వరలోనే వచ్చి, రావణుణ్ణి చంపి, నీతోసహా అయోధ్యకు పోతాడు," అన్నాడు హనుమంతుడు.

సీత హనుమంతుడితో, "హనుమంతుడా, నువు రాముణ్ణి చూడగానే నాకు బదులుగా సాష్టాంగ నమస్కారం చెయ్యి: లక్ష్మణుడు ఉత్తముడు. అతను సమస్తమూ విడిచిపెట్టి, రాముడి వెంట అరణ్యాలకు వచ్చాడు. అతన్ని క్షేమం అడిగానని చెప్పు," అంటూ తన కొంగున కట్టుకుని ఉన్న చూడామణి తీసి అతనికి ఇచ్చింది.

హనుమంతుడు చిన్న రూపంలోనే ఉన్నప్పటికీ తల వెంట్రుకలు దూర వలసిన రంధ్రంలో అతని చెయ్యి దూర లేదు. అందుచేత అతను దానిని తన వేలికి తగిలించుకుని, సీతకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి నిలబడ్డాడు.

"హనుమంతుడా, రాముడు ఈ చూడా మణిని చూడగానే నా తల్లినీ, నన్నూ, దశరథుణ్ణీ గుర్తుకు తెచ్చుకుంటాడు. ఇక జరగవలసిన దంతా నీ మీదనే ఆధారపడి ఉన్నది. నా దుఃఖం తీరే మార్గం నువే ఆలోచించి చెయ్యి," అని సీత అన్నది. ఆమె సుగ్రీవుణ్ణీ, అతని మంత్రులనూ, వానర శ్రేష్ఠులనూ అడిగి నట్టు చెప్పమన్నది.

ఆమెకు ఇంతచెప్పిన తరవాత ఒక సందేహం పట్టుకున్నది.

"హనుమంతుడా, నువ్వయితే ఈ సముద్రాన్ని దాటి రాగలిగావు గాని, రామలక్ష్మణులూ, ఇతర సేనలూ ఇక్కడికి ఎలా వస్తారు? రావణుడితో ఎలా యుద్ధం చేస్తారు? నువే యుద్ధంచేసి రావణుణ్ణి చంపితే రాముడికి గాని, నాకుగాని ఏమి కీర్తి వస్తుంది?" అని ఆమె అడిగింది.

దానికి హనుమంతుడు, "సీతాదేవి, వానర, భల్లూక సైన్యాలకు అధిపతి అయిన సుగ్రీవుడు తలుచుకుంటే ఏదైనా చెయ్యగలడు. అతని సేనలో నాతో సమానులూ, నన్ను మించిన వాళ్ళూ ఎందరో





ఉన్నారు. నేనే సముద్రం దాటగా, వాళ్లు దాటటం ఒక లెక్కా? అందుచేత నువ్వు విచారించకు. నీకు క్షేమం కలుగుగాక!" అని సీత వద్ద సెలవు పుచ్చుకుని అక్కడి నుంచి కదిలాడు.

కొంత దూరం వెళ్ళాక అతను తనలో, "సీతను చూశాను. కాని ఇంకొక్క చిన్న పని మిగిలి పోయింది. అది శౌర్య పరాక్రమాలతో గాని జరగదు. కొందరు రాక్షసులను చంపితే గాని మిగిలిన రాక్షసులు మెత్తబడరు. రాక్షసులు ఎలా యుద్ధం చేస్తారో, వారి బలం ఏపాటిదో చూసి మరీ కిష్కింధకు తిరిగి వెళతాను. రాక్షసులను యుద్ధానికి ప్రేరేపించటానికి సులువైన మార్గం ఏమిటి?" అని ఆలోచించాడు.

అశోకవనం చాలా అందంగా, నందన వనాన్ని పోలి ఉన్నది. అది రావణుడికి చాలా ఇష్టం అయి ఉండాలి. దీన్ని తాను ధ్వంసం చేస్తే రావణుడికి తప్పక కోపం వస్తుంది. అప్పుడు రావణుడు తన పైకి రాక్షస సేనలను పంపుతాడు. యుద్ధం జరుగుతుంది. తాను ఆ రాక్షసులందరినీ చంపి, నిశ్చింతగా కిష్కింధకు వెళ్ళిపోవచ్చు.

ఇలా ఆలోచించి హనుమంతుడు అశోకవనంలో ఉన్న చెట్లను పడదోయ సాగాడు. అతను చెట్లను పడగొట్టటంతో బాటు, అందంగా కట్టిన కొలను గట్లు విరిచి, క్రీడాపర్వతాల శిఖరాలను విరిచాడు. కొద్ది సేపట్లోనే అశోకవనం బీభత్సరూపం ధరించింది. చెట్ల మీద ఉండిన పక్షులు అటూ ఇటూ ఎగురుతూ ఆర్తనాదాలు చేశాయి.

విరిగిన చెట్లూ, తెగిన లతలూ వాడు ముఖం పెట్టాయి. అశోకవనమే దుఃఖంలో మునిగిపోయినట్టు కనబడింది.

ఇదంతా చేసిన హనుమంతుడు సరాసరి వెళ్ళి, అశోకవనం తాలూకు బయటి ద్వారం వద్ద నిలబడి, రాక్షసుల కోసం ఎదురు చూడసాగాడు.

చెట్లు విరిగే చప్పుడూ, పక్షుల ఆర్తనాదాలూ లంకలో వాళ్ళకు వినిపించాయి. అంతదాకా నిద్రపోతున్న రాక్షస స్త్రీలు ఈ ధ్వనులకు లేచి, పెంచిన దేహంతో వనాన్ని ధ్వంసం చేస్తున్న హనుమంతుణ్ణి చూశారు. వాళ్ళు తనను చూడటం గమనించి, హనుమంతుడు తన దేహాన్ని మరింతగా పెంచాడు.

అప్పుడా రాక్షసస్త్రీలు సీతను, "ఇతను ఎవరు? ఎవరు పంపారు? ఎందుకు వచ్చాడు? నీతో ఏం మాట్లాడాడు? నువు భయపడకు. మాతో నిజం చెప్పు." అన్నారు.

"రాక్షసులు రకరకాల రూపాలు ధరిస్తారు. నాకు వాళ్ళ సంగతి ఎలా తెలుస్తుంది? పాము కాళ్ళు పాముకే తెలియాలి. మీరూ రాక్షసులే గనక రాక్షస మాయలు మీకే తెలుస్తాయి. ఈ వానరుడెవడో, ఏం చేస్తాడో మీరే తెలుసుకోండి. ఇతన్ని చూస్తే నాకు భయంగానే ఉన్నది. చెప్పండి, ఇతనెవడు?" అన్నది సీత.

సీత ఇలా అనేసరికి రాక్షసస్త్రీలు భయపడ్డారు. కొందరు సీతకు రక్షగా ఉండి పోగా, కొందరు భయంతో ఆర్తనాదాలు చేస్తూ పారిపోగా, మరి కొందరు ఈ సంగతి రావణుడికి చెప్పటానికి వెళ్ళారు.

అలా వెళ్ళిన వాళ్ళు రావణుడితో, "ఎవడో భయంకరాకారుడూ, అమిత బలవంతుడూ అయిన వాడు వచ్చి, సీతతో మాట్లాడి, అశోకవనంలో ఉన్నాడు. ఎంత అడిగినా, సీత అతని సంగతి చెప్పకుండా ఉన్నది. ఆ వానరుడు దేవేంద్రుడి దూత అయినదీ, కుబేరుడి దూత అయినదీ, రాముడి దూత అయినదీ తెలియటం లేదు. వాడుమాత్రం అశోకవనమంతా ధ్వంసం చేసేస్తున్నాడు. ఒక్క సీత కూర్చుని ఉన్న చెట్టు తప్పిస్తే మిగిలిన వనమంతా కూలిపోయింది. ఆ వానరుణ్ణి నువు వెంటనే కఠినంగా శిక్షించాలి. సీతతో మాట్లాడినందుకే నువు వాణ్ణి చంప వచ్చు." అన్నారు.





# అమరవాణి

ఐశ్వర్యే వా సువిస్తీర్ణే,
వ్యసనే వా సుదారుణే,
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా
కృతాంతః పరికర్షతి. 1

[మితిమీరిన ఐశ్వర్యం వచ్చినప్పుడూ, అతి భయంకరమైన వ్యసనం కలిగినప్పుడూ, దైవం తాడుతో లాగా మనిషిని బంధించి లాగుతాడు]

అకృతాత్మాన మాసాద్య
రాజా నమనయే రతమ్,
సమృద్ధాని వినశ్యంతి
రాష్ట్రాణి నగరాణి చ. 2

[రాజు తెలివి లేనివాడూ, దుర్మార్గుడూ అయితే, ఎంత సమృద్ధిగల రాష్ట్రాలూ, నగరాలూ కూడా నాశనమైపోతాయి.]

హిత్వా ధర్మం తథార్థంచ
కామం యస్తు నిషేవతే,
స వృక్షాగ్రే యథా సుప్తః
పతితః ప్రతిబుధ్యతే. 3

[ధర్మార్థాలను వదిలిపెట్టి, కామాన్ని మాత్రమే కోరేవాడు, చెట్టు కొనన నిద్ర పోయేవాడి లాగా పడిన తరవాతనే తెలుసుకుంటాడు.]

చెంపాయేవాళ్ళు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు నవంబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డుపైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒకటి రెండు మాటలలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జనవరి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| మిత్రభేదం - 29 ... 2 | | మతిస్థ ... 31 | |
| విచిత్రకవలలు-17 ... 5 | | నిధిరహస్యం ... 35 | |
| అలౌకిక సుందరి ... 13 | | తల్లి చేసిన మేలు ... 39 | |
| ఆహా ... 21 | | సమ్మాననబంట్లు .... 41 | |
| మైహాలో పెళ్ళి .... 28 | | వీరహనుమాన్ - 14 ... 45 | |


రెండవ ఫోటో:
చేతులకు అలంకరణ

మూడవ ఫోటో:
నిలువునా అలంకరణ

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor : NAGI REDDI

# జెమ్స్‌తో బలే మజా!

వీటిని గుర్తుపట్టండి చూద్దాం







పిల్లలు మెచ్చే
రంగు రంగుల
చాక్లెట్
జెమ్స్

క్యాడ్బరీస్
జెమ్స్ - పిల్లలు మనసుపడేవి, నోరూరించేవి!

C-5 TL

*Photo by:* **A. L. SYED**



WHOLE-BODY DECORATION

